# జైబులు

కృష్ణాపశ్చిమ, సెంట్రలు, సర్కిల్సు ఇన్విస్టిగేషను అడ్వైజరీ కమిటీ

జనవరి 19 వ తేది సాయంకాలం 4 గంటలకు రేపల్లెలో సమావేశమగును. కృష్ణాపశ్చిమ డివిజను ఎక్జిక్యూటివు యింజనీరు గారు హాజరగుదురు. నీటిపారుదలయిబ్బందులను తొలగించుకొనగోరువారందరును యీ సభకు హాజరయి, తమయిబ్బందులను కమిటీవారికి తెలియజేయవలెనని కోరుచున్నాను.

ఇట్లు,

ప్రొఫెసరు ఎన్. జి. రంగా.

(అధ్యక్షుడు)

---

## శ్రీ శారదానికేతనముకు భూరివిరాళము

శ్రీ చల్లపల్లి కుమారరాజాగారు వారి పట్టాభిషేక మహోత్సవకాలమందు ఆంధ్రదేశమందలి సంస్థలకు తమ సహజ ఔదార్యముతో వివిధ పారితోషికములిచ్చి గౌరవించిరి. ఆ కాలమందు గుంటూరు శ్రీ శారదానికేతనమునకు రు 1116-0-0 వెయ్యిన్నూట పదహారులిచ్చి గౌరవించిరి. వీరి దాతృత్వమునకు శారదానికేతనమువారెంతయు కృతజ్ఞులు. ఈధనము నికేతనమూలధనమునకు చేర్చబడి బ్యాంకులో వేయబడినది.

నేతి వెంకటాచలపతి,

మేనేజరు.

---

## కీ. శే. బుద్ధరాజు అచ్యుతరామరాజు

ఈ వయోవృద్ధుడు తూ॥ గోదావరిజిల్లా అవిడిగ్రామములో నున్న శ్రీ గాంధీ జాతీయ విద్యాలయములో "హిందీ ప్రచారకుడు"గా 1922వ సంవత్సరమునుండి పనిచేయుచుండెను. నేను శ్రీ గాంధీ విద్యాలయమును స్థాపించినపుడును విద్యాలయ భవనమును నిర్మాణము చేసినపుడును ఈ యువకుడు పడిన కష్టములు నాకుమాత్రమే తెలుసును. ఈ యువకుని సహాయములేనియెడల ఈ జాతీయ సంస్థను స్థాపించి భవన నిర్మాణము చేయకలిగెడివాడను కాకయుందును. హాస్యపూరితమైన జాతీయగీతములను పాడుచు మెడలో పంచితగుల్చుకొని అర్ధరాత్రిసమయమైనను నిర్భయముగా ప్రయాణము చేయుచుండెడివాడు. ఈయన ప్రోత్సాహము వల్లనే ఈ విద్యాలయములో సుమారు 40 మంది పంచమ విద్యార్థులు చేరుటయు, పెద్దజాతి బాలురు వీరితో కలసి అమరకోశము హిందీ చదువుటయు ఈ పూర్వాచార పరాయణుల మధ్య కలిగినది. దరిద్రుడుగా జన్మించినను స్వార్థమనునది లేకుండెను. విద్యాలయ చందాలు వసూలుచేయునపుడు, ఒక ధనవంతునియాశ్రయించుట కన్న పదిమంది బీదలను ప్రోత్సాహపరచి చందాలు వసూలు చేయుచుండెడివాడు. నిరంతరము ఖద్దరు ప్రచారముచేయుచూ అనేకరాట్నములను నెలకొల్పియుండెను. ఎప్పుడు కలరా, మశూచికములు వచ్చినను, మా శ్రీ గాంధీ ఉచిత ఔషధాలయము తరఫున వారితో కలసి రాత్రింబగళ్లు రోగులకు ఉచితసేవ చేయుచుండెడివాడు. ఇట్టి యువకుడు గుండెవ్యాధివలన డిశెంబరు 27 వ తేది ఉదయం అకాలమరణమునకు పాలగుట దేశదౌర్భాగ్యము. ఈ ఆత్మకు శాంతి కలుగుగాక.

గోటేటి వెంకట్రావు.

---



## గుణుపురం (విశాఖపట్నం జిల్లా)

### వీడుకోలు

విశాఖపట్నంజిల్లా శ్రీజయపురం సంస్థానాధీశుల పాలనపు లోబడియున్న గుణుపురం డివిజనుకు మేనేజరుగా వి. అన్నగం మొదలియారుగారు 1926 సం॥ రం ఏప్రిల్ నెలలో మ. వి. రామకృష్ణచౌదరి గారు ఎమ్. ఏ. బి. సి. ఎస్. బి. ఎస్. సి. శ్రీ జయపురం దివాంజీసాహేబ్ వారిచే నియమించబడినారు. వీరు గవర్నమెంటు రిటైర్డుతహసీల్దారుగారు. 1929 సం॥రం ఆఖరువరకు అతి నేర్పుతోను, సరసతగాను కార్యదీక్షాపరులై సంస్థాన ఉద్యోగీయుల స్వల్పవేతనములు గుర్తించి బాధలేని భయము జూపి పనుల సాగించుకొనుచు రయితుల అక్కరలను సంస్థానమునకు నష్టము లేకుండాతీర్చి సర్వజనామోదమును పొందినారు. వృద్ధులైనను శ్రీ సర్కారువారి పనిపాటలలో ఏమాత్రమును లోటురానీయక శరీరశ్రమ కోర్చి ఏజన్సీయని భయపడక సకలకార్యములు సంతృప్తికరముగ నెరవేర్చి అనేకపర్యాయములందు శ్రీ రాజావారి మెప్పును పొందియుండిరి. ప్రస్తుతము దేహము నారోగ్యముగా నుంటచే శ్రీ సర్కారువారి అనుమతిపైని వారిస్వగ్రామమగు కంజీవరమునకు దయచేయుచుండుటచేత 1-1-30 తేదీని గుణుపురంతాణా రాజేదారగు మ॥ సూర్యానుల రామస్వామినాయులుగారు ఘనమైన ఏర్పాటులతో అల్పాహారవిందునొసగుచు శ్రీ మొదలియారుగారి ఆదర్శ జీవితసంగ్రహములను సభాముఖమున వివరించి చెప్పి సభ్యుల సావధానపరిచిరి. తరువాత పురోహిత సీతారామశాస్త్రిగారును, శ్రీపాద ప్రకాశము పంతులుగారును మొదలియారుగారి జీవితములోని కొన్ని ఘట్టములను వృదుమధురమైన గద్యపద్యములతో చెప్పిరి. తదుపరి శ్రీ జయపురం మహారాజావారు శ్రీ మొదలియారుగారి సేవలను కృతజ్ఞతతో అంగీకరిస్తూ మనఃపూర్తిగా దయచేయించిన రూ (1116-0-0) వెయిన్నూట పదియార్లు తాసేదారుగారు కరతాళధ్వనుల మధ్య, వెండిపళ్లెరములో నిడి మొదలియారుగారికి సమర్పించిరి. సర్వజనసమ్మానితులైన మొదలియారుగారి వీడుకోలు చింత వ్రాయుటలో నన పిన్నవయస్కులను అతి మేధావంతులును అగు యస్. వి. నరసింహారావుగారు మేనేజరుపదవి వహించి వింగుల్ పాల్గొనిరి. శ్రీ జయపురం సంస్థానములో మొదలియారుగారికి జరిగినట్టి సన్మానము మరి ఏ మేనేజరునకు జరిగియుండలేదు.

మొదలియారుగారి కారోగ్యము చేకూరుటకుగాను 2-1-30 తేదీని శ్రీ రాజేదారుగారు మాకుమంది బీదలకు సంతర్పణగావించిరి.

శ్రీ॥ నరసింహస్వామి,

---

## గూడూరు, రాపూరు తాలూకాల ప్రాథమిక విద్యాసంఘపు పంచమమహాసభ, రాపూరు

ఈ సంఘముయొక్క పంచమసమావేశము 1930 సం॥ ఫిబ్రవరి నెల తే 22 ది శనివారము రాపూరు తాలూకా రాపూరుగ్రామ బోర్డు ఎలిమెంటరీ పాఠశాలభవనమున జరుపబడును.

శ్రీ వెంకటగిరి హైస్కూలు హెడ్‌మాస్టరు మ॥రా॥రా॥ శ్రీ ఎ. జగన్నాథశాస్త్రిపంతులు గారు అగ్రాసనాధిపత్యము వహింప దయతో నంగీకరించిరి.



## ఆత్మకూరు ఉదయగిరి తాలూకాల ప్రాథమిక విద్యాసంఘము

(ప్రథమ మహాసభ-వందవరం (తే 28-12-29)

1929 వ సం॥ డిసెంబరునెల 28 తేది సోమవారము, ఉదయగిరి తాలూకా వందవరంగ్రామ పత్రశాలయందు, నెల్లూరు వెంకటగిరి రాజాగారికాలేజి ఇంగ్లీషు లెక్చరరు మ. రా. రా. శ్రీ గజ్జెల వేంకట సుబ్బరామయ్య పంతులు ఎం. ఏ. (ఆనర్సు) గారి అధ్యక్షతక్రింద పైసంఘపు ప్రథమ మహాసభ జయప్రదముగ జరిగెను- ఆత్మకూరు తాలూకాబోర్డు ప్రసిడెంటుగారగు శ్రీయుత పి. చెంచయ్యనాయుడుగారును, ఉపాధ్యక్షులగు శ్రీయుత జి. వెంకటస్వామి నాయుడుగారును, ఉదయగిరి రేంజిస్కూల్సు డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారగు శ్రీయుత ఎ. పద్మనాభరెడ్డి బి. ఏ. యల్. టి. గారును, జిల్లావిద్యా సంఘసభ్యులగు శ్రీయుత వాగాటి నారసింహారెడ్డి గారును, వింజమూరు పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరుగారును, మండల ప్రాథమిక విద్యాసంఘ కార్యదర్శి శ్రీయుత సి॥ సూర్యనారాయణశర్మగారును, ఉభయ తాలూకాలలోని అన్నివిధముల పాఠశాలల అన్నిటిగల ఉపాధ్యాయులును, సుమారు 250 మంది సభకు విచ్చేసిరి. ఆహ్వానసంఘాధ్యక్షులగు పి. చెంచయ్యనాయుడుగారి స్వాగతోపన్యాసము జరిగినపిదప, అధ్యక్షులు పుష్పమాలాలంకృతులై, మేళ, తాళ వాద్యములును, కరతాళధ్వనులును చెల్లంగ, అధ్యక్షస్థానము నాక్రమించి, ఉద్రేకపూరితమగునట్టియు, భావగర్భితమగునట్టియు, సభను కంపింపజేయునట్టియు, గంభీర ప్రారంభోపన్యాస మిచ్చిరి. పిదప స్వాగత పద్యరత్నములు సమర్పింపబడెను—అనంతరము విషయనిర్ణయ సభయందు కొన్నితీర్మానములు గావింపబడి సభ చాలింపబడెను.

తిరిగి మధ్యాహ్నము రెండు గంటలకు సభ యారంభమయ్యెను- శ్రీయుత అనం పద్మనాభరెడ్డి బి. ఏ. యల్. టి. గారు, ప్రస్తుత ప్రాథమికోపాధ్యాయులకు బోధనామూచనలను శీర్షికక్రింద ఉత్సాహజనితమగు, చక్కని యాంధ్రభాషయందుపన్యసించి సభాసదుల హృదయవశీకరణులైరి. తదుపరి మహాసభయందు కొన్నితీర్మానము లామోదింపబడి ఎన్నికలు జరిగెను—శ్రీయుత యస్. వి. వి. కుమారస్వామిగారు, కార్యదర్శిగను, శ్రీయుత పల్లెకొండ రంగయ్యగారు, సహాయ కార్యదర్శిగను, కోశాధిపతిగను, సభవారేకగ్రీవముగా నెన్నుకొనిరి. పిదప అధ్యక్షులకును, తదితరులకును, వందనము లర్పింపబడి జాతీయగీతముతోను, కరతాళధ్వనులతోను, జయ జయ ధ్వనులతోను సుమారు రాత్రి 7 గంటలకు సభ ముగింపబడెను.

పల్లెకొండ రంగయ్య

# పశ్చిమగోదావరిజిల్లా మద్యపాన నిషేధక సంఘము, ఏలూరు.

పశ్చిమగోదావరిజిల్లా మద్యపాన నిషేధక సంఘము సెప్టెంబరు 15-వ తారీఖున నిర్మాణము కాబడి ముగ్గురు ప్రచారకులతో అక్టోబరు 15-వ తేదీనుంచి పని ప్రారంభించినది. జిల్లా ప్రచారక సంఘపు ఆఫీసుకొరకు గాను నెలకు రు 25 అద్దెగాను ఒక విశాలమైన భవనము తీసికొనబడినది. సమర్థుడగు కార్యదర్శి యింతవరకును సంఘమునకు లభ్యము కానందున కార్యదర్శి నియామకము కాలేదు. జనవరి నెలలో కార్యదర్శి నియామకము కాగలదు.

## ప్రచారము

ముగ్గురు ప్రచారకులతో పని ప్రారంభమై మరియిద్దరు ప్రచారకులను సంఘమువారు నియమించి మొత్తం 5 గురచేతను పనిచేయించుచున్నారు. ఏలూరు మ్యునిసిపాలిటీలో నొకరును తణుకు నర్సాపురము భీమవరము ఏలూరుతాలూకాల కొక్కొక్కరును చొప్పున జిల్లాలో ప్రచారకులు పనిచేయుచున్నారు. ఈప్రచారకులు అక్టోబరు 15-వ తేదీనుండి డిసెంబరు 15-వ తేదీవరకు 148 గ్రామములలో ప్రచారముచేసిరి. మొత్తం 177 ఉపన్యాసము లిచ్చిరి.

ఒక్కొక్క మీటింగునకు మొత్తమువీదను 125 గురు ప్రేక్షకులు హాజరైరి. కలపర్రు, శనివారపేట, ఎనమదురు గ్రామములు 873గురు మద్యపానము పూర్తిగా నిషేధించితిమనియు ఆ గ్రామములలో ఈదుకాణములను మూసివేయింపవలసినదనియు సంఘమువారికి అర్జీలు యిచ్చుకొనిరి.

## సభలు

భీమవరము గ్రామములోను ఏలూరు తాలూకా దెందులూరులోను జిల్లాసంఘముతరపున రెండు బహిరంగసభలు జరిగినవి. ఆ సభలలో మహారాజశ్రీ వరాలశెట్టి దేవేంద్రుడుగారు వల్లంకి కృష్ణమూర్తిగారు, భమిడిపాటి సూర్యనారాయణగారు మరియు సంఘప్రచారకులగు రాయుడు గంగయ్య, నీలం వెంకయ్యగార్లును ఉపన్యాసము లిచ్చిరి. జిల్లా ఆరోగ్యశాఖాధికారియగు మ॥రా॥శ్రీ॥ డాక్టరు యస్. రంగస్వామిఅయ్యంగారు యల్. యమ్. ఎస్. మాజికులాంతరు ఉపన్యాసమిచ్చిరి. నర్సాపురము తాలూకాసభ్యులకు రెవరెండు జె. యస్. బోయిడ్ గారు మూడుసభలను పాలకొల్లు నర్సాపుర గ్రామములలో అఖిల భారత మద్యపాననిషేధక సంఘగౌరవకార్యాధిపతియగు మిస్. క్యాంబెల్, మిస్. నారాయణదాస్. బి. యే, గార్ల అధ్యక్షత క్రింద సభలుచేసిరి.

జిల్లా సంఘసభ్యులలో నొకరగు మ॥రా॥ శ్రీ॥ వల్లంకి కృష్ణమూర్తిగారు, తణుకు భీమవరము, ఏలూరు, కొవ్వూరు తాలూకాలలో సంచారముచేసి తాలూకా ప్రముఖులలో మాటలాడి మద్యపాననిషేధప్రచారమును జిల్లాలో కొనసాగించుటకు తగువేర్పాట్లు చేసిరి. పశ్చిమగోదావరి జిల్లాకాంగ్రెస్ సంఘము, ఏలూరు గ్రామ కాంగ్రెస్‌సంఘము, ఏలూరుతాలూకా కాంగ్రెస్‌సంఘము, ఏలూరు కో-ఆపరేటివు యూనియన్, ఏలూరు అంజుమన్, ఏలూరు బ్రాహ్మణేతర యువజనసంఘము, భీమవరము హిందూసమాజము, తణుకు తాలూకా కాంగ్రెసు సంఘము, పశ్చిమగోదావరి జిల్లా ఆదిఆంధ్రసంఘముల అధ్యక్షులతోను కార్యదర్శులతోను ప్రచారకవిధానమును సంప్రతింపగా ఈ సంఘము లన్నియు నిందువిషయమై తోడ్పడుటకు హృదయపూర్వకముగా అంగీకరించెను. మరియు పశ్చిమగోదావరి జిల్లా మద్యపాననిషేధకసంఘము తరఫున ప్రబోధము పల్లె జిల్లాలో ప్రచారముచేయుటకు 15 గురు పెద్దమనుష్యులు వాగ్దానము చేసిరి.

పశ్చిమగోదావరి జిల్లాలో మద్యపాననిషేధక ప్రచారము బాగుగా జరుగుచున్నది. ప్రచారకు లందరు సమర్థులు. ఈ మహాసేవయంతయు తమపై వైచుకొని తగిన కట్టుదిట్టములతో ఏర్పాటు చేయుచున్నందుకు అధ్యక్షులగు మ॥ రా॥ శ్రీ॥ వరాలశెట్టి దేవేంద్రుడుగారెంతయు వందనీయులు.

కర్వాసేని నారాయణరావు.



శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద బహద్దరు జమీందారుగారికి పట్టాభిషేకమహోత్సవ సందర్భమున అంగలూరు పశుచికిత్సాలయ పక్షమున శ్రీవారి కర్పింపబడిన

# వినతి పత్రము

ప్రభూ!

"నావిష్ణుః పృథివీపతిః" యను వార్యోక్తిప్రకారము భూపతి వగు నీవు విష్ణ్వంశసంభూతుడవు. ప్రజలను పాలించుట మాత్రమే నీధర్మము కాదు. బ్రాహ్మణుల, పోషించుట మాత్రమే నీకర్తవ్యముకాదు. "గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం" మ్మను దానియందు ప్రథమమున గోవులు చేర్పబడుటం బట్టిచూడ లోకకళ్యాణము కొఱకు బ్రాహ్మణుల (ప్రజల) కంటెముందు గోవులు శుభయుతములై యుండవలయునని కోరుట ప్రాముఖ్యమని సూచించు చున్నయది. గోమాత యెంత శుభయుతముగ నున్న దేశము నందంత భాగ్యభోగ్యములం దుల దూగుచుండును. కర్షకవర్గము సుఖముగ నున్నప్పుడే రాజ్యము సుభిక్షముగ నుండెడిని. ఇది సత్యము.

రాజేంద్రా!

మీ సంస్థానమునందు పంచకళ్యాణము లున్నయవి, యుష్ట్రము లున్నయవి. అయ్యవి రాజచిహ్నమాత్రములే, కాని గోసంతతి యట్టిదికాదు. గోపూజ భారత జాత్యభ్యుదయమునకును, రాజ్యవైభవమునకును మూలకందమని గ్రహింతురుగాక!

పూర్వప్రభువులు పశుపోషణమునే ప్రధానధర్మముగ భావించి తమరాజ్యములం దక్కడక్కడ విశాలమగు గోభూములను, పావకక్షేత్రములను నేర్పాటుచేసి యుండిరి. అందుకు తమ సంస్థానమధ్యమందు దలదాగు గుంటపాలయను గ్రామమే ప్రబలతార్కాణము.

అశోకచక్రవర్తి పశువుల ఆరోగ్యము నిమిత్తము తన సామ్రాజ్యమునందు జిల్లాల పశుచికిత్సాలయముల నెలకొల్పి పశుపోషణమునకు దోడ్పడిన విధము చరిత్రప్రసిద్ధమేకదా!

భూపతీ!

కావున మీరట్టి పవిత్రకార్యమునకు పూనుకొందురుగాక! మీ రాజ్యమునందు పశుచికిత్సాలయముల స్థాపించి సన్నగిల్లియున్న పశువైద్యమును వర్ధింతురుగాక!

చల్లపల్లి, 26-12-1929 — యెజ్ల శ్రీరాములు చౌదరి, వెటరినరీ ఆయుర్వేదభూషణ.

# మద్యపాన నిషేధక ప్రచారము

## అందుకు ఉపయుక్తములగు పటములు

ప్రచారకులు పట్టణములందును, గ్రామములందును సంచరించి మద్యపాన నిషేధముకొర్కు, పటముల ద్వారాను, పత్రికల మూలమునను, ప్రసంగములు చేయుటవల్లను, ప్రచారము చేయుచున్న వారై యున్నారు.

ఇట్టి యంశములు బోధించునప్పుడు పటముల సహాయమున బోధించినచో మిగుల లాభకరముగనుండునని వేరుగ జెప్ప నవసరము లేదు. మద్యపానము యొక్క చెడుగులను సూచించు ఈ క్రింది పటములు ప్రచారకులకు మిగుల సహాయకరముగనుండు నని నమ్ముచున్నాము. వీనినిచూచినవా రందరట్లే చెప్పుచున్నారు. అవియందరకు తెలియునట్లు రంగులతో చక్కగా చిత్రింపబడి తెలుగులో వివరింపబడి యున్నవి. 18 + 16 అంగుళములు పరిమాణము గలిగియున్నవి. దళసరియట్టలపై యంటించి వాడుకొనిన ప్రదర్శనమునకు వీలుగానుండును. ఒక్కొక్క పటము వెల ఒకరూపాయి. ఇంకను పటములు చిత్రింపబడి విక్రయమునకు సిద్ధముగానున్నవి.

1. మద్యపాన వృక్షఫలములు (సారాయము, గంజాయి, నల్లమందు, పొగాకు, యొక్కఫలము లింపుచక్కగా చిత్రింపబడియున్నవి.)

2 మద్యపాన సర్పము. (ఒక విషసర్పము బ్రాందిసీసా, మద్యమున్న గాజుగ్లాసును చుట్టుకొని పడగెత్తి యాడుచున్నట్లున్నది.)

3. మూడు మద్యపాన విషసర్పములు. (మద్యపానము మీద సర్కారువారికి రాబడి యొక కోటినుండి, అరుకోట్లకును, పిమ్మట ఇరువది నాలుగుకోట్లకును వృద్ధియైనట్లు ఈపటము సూచించును.)

4. మద్యపాన శకటము. (ఈశకటము తాటిచెట్లపాలెము, ఈతచెట్లగూడెము, సారానగరములనుండి బయలుదేరి కల్లు సారాయముల నెక్కించుకొని ముప్పది గ్రామముల మీదుగాపోయి వానికి కీడు కలుగజేసి, తుదకు నాశనపురమునకుబోవుచున్నది మిగుల వినోదముగను, జ్ఞానబోధకముగను నుండును.)

5. సారాయము, నీళ్లు, త్రాగిపెరిగిన రెండుకోడిపిల్లల పటము. (సారాయము అనారోగ్యకరమైనదని సూచించుచున్నది)

6. త్రాగని వానియొక్కయు, మితముగ త్రాగువానియొక్కయు, త్రాగుబోతుయొక్కయు అన్నకోశములు గల పటము. (మద్యపానము అన్నకోశమును కెట్లు హానిచేయుచున్నదో ఈపటము తెలియజేయుచున్నది.)

పై పటములు భీమునిపట్టణము, మద్యపాన నిషేధక సంఘోపాధ్యక్షుడగు పుల్లేటుర్తి వీరాచార్యులుగారివద్ద దొరకును,

పుల్లేటుర్తి వీరాచార్యులు-భీమునిపట్టణము.

## ఆంధ్ర విద్యార్థి మహాజనసభ

సుభాష్ చంద్రబోసుగారు అధ్యక్షత వహింతురు

రాజమహేంద్రవరము, 17 జనేవరి:— రాజమహేంద్రవరములో జనేవరి మూడవవారములో జరుగనున్న ఆంధ్రవిద్యార్థిమహాజనసభకు బాబు సుభాసుచంద్రబోసుగారు అధ్యక్షత వహింతురు.

(స్వకీయవిలేఖరి)

## ఏడిద బాలికాపాఠశాల వార్షికోత్సవము

ది 4-1-1930 తేదీ మధ్యాహ్నము 3 గంటలకు రామచంద్రపురం తాలూకా ఏడిద గ్రామములో బాలికా పాఠశాల వార్షికోత్సవము జరిగినది. గ్రామపెద్దలు చుట్టుపట్ల స్కూలు ఉపాధ్యాయులు సభ నలంకరించిరి. స్కూలు ప్రధానోపాధ్యాయులగు మ॥ రా॥ రా॥ శ్రీ దంటు సత్యనారాయణగారు స్కూలు సాంవత్సరికనివేదకము చదివి స్కూలు అభివృద్ధిని సూచించిరి. స్కూలులో 5 గురు ఉపాధ్యాయులు పని చేయుచున్నారు. 150 మంది బాలికలు విద్య నరచుచున్నారు. స్కూలునకు తగిన భవనము లేకుండుటచే యింకను పిల్లల సంఖ్య వృద్ధిచేయుటకు వీలుకాకున్నది. శ్రీయుత నరసింహదేవర సత్యనారాయణ గారు అధ్యక్షోపన్యాసమునందు, పల్లెటూళ్లలో తల్లిదండ్రులు స్త్రీల విద్యాభివృద్ధివిషయమై తగు శ్రద్ధవహించుట లేదనియు, స్త్రీలు వెనుకబడి యుండుటచేతనే, జాతీయోద్యమమునకు కూడ తగుశక్తి కలుగుటలేదనియు, సంపూర్ణజాతీయవికాసమునకు, స్త్రీలలో సంపూర్ణస్వాతంత్ర్యభావములు ప్రజ్వరిల్లవలె ననియు, బాలికా పాఠశాలలో బాలికలకు ఉత్తమ హైందవ నారీమణుల చరిత్రలు బోధించవలెననియు, చదువను, వ్రాయను నేర్పుటతోడనే చదువు పరిసమాప్తి చెప్పక, గృహ పరిశ్రమలు పెంపొందించుటకు గృహనిర్వహణవిషయములందు తరఫీదు నిచ్చుటకు, అన్నిటికంటెను ముఖ్యముగా, విద్యతోబాటు వినయవివేకాది సద్గుణగ్రహణమునందు, యుపాధ్యాయులు తిరిపీదు నీయవలసినదిగా బోధించిరి. ప్రభుత్వమువారు అవలంబించుచున్న విద్యావిధానపద్ధతులు చాల అసంతృప్తిగా నున్నవనియు, స్థానికసంస్థలుకూడ యీ విషయమై యేమియుచేయ లేకున్నవనియు, స్థానికసంస్థలలో విద్యావిషయమై వినియోగించుటకు తగినధనము లేదనియు ప్రభుత్వమువారు విద్యావిషయమై ఖర్చుపెట్టుచున్న డబ్బుయెంతమాత్రము తృప్తికరముగా లేదనియు చెప్పిరి. ఉపాధ్యాయులు దేశాభిమానమువహించి, ముందుకాబోవు పౌరులను ఉన్నత జాతీయభావములో యుపదేశించి, స్వాతంత్ర్యవిజయమునకు తోడ్పడవలసినదిగా యుద్బోధించిరి. పిమ్మట పాఠశాలలో మహాత్మాగాంధీగారిపటము ప్రతిష్ఠింపుచు మహాత్ముని పవిత్రజీవితము సంగ్రహముగ తెలిపి, మహాత్ముని ఉన్నతాదర్శకములు జీవితములో ఆచరణలో పెట్టుట కెల్లరు కృషిసలుపవలసినదనియు ముఖ్యముగా మహాత్ముని రాట్న సందేశమును బాలికలు, అనుదినము ఆచరణలో పెట్టవలసినదిగా సత్యనారాయణగారు బాలికలకు హెచ్చరించిరి. మహాత్ముని చిత్రపటమును బహిరంగపరచిరి.

పిమ్మట పాఠశాలబాలికలు "కుచేలుని" నాటకము ప్రదర్శించిరి. కుచేల, శ్రీకృష్ణపాత్రములు ధరించిన బాలికల ప్రదర్శనము చాల అభినందింపబడినది. వారియువురకు అధ్యక్షులు పోతనామాత్యుని భాగవతము వ్యాఖ్యానములు బహుమతిగ నొసంగిరి. మిగిలిన పిల్లలకు గ్రామస్థులు బోర్డువారయిచ్చిన విరాళములలో ఆటవస్తువులు పంచిపెట్టబడినవి. అధ్యక్షులకు గ్రామస్థులకు వందనములతో సభ సమాప్తియయినది.

(స్వకీయవిలేఖరి)

## శ్రీధన్వంతరి-శారద

సంపాదకులు విద్వాన్ కే. శేషశాస్త్రిగారు-శృంగేరి మైసూరు సంస్థానము

శుక్లసంవత్సర కార్తికమాసమున వెలువడిన 6 వ సంపుటము 3-4 సంచికలను కృతజ్ఞతతో నందుకొంటిమి. ఇది వైద్యపత్రిక, కన్నడభాషలో వెలువడును.

### శారద

ఇదికూడ వైద్యపత్రికయే. సంస్కృతభాషలో వెలువడును. కార్తికమాసమున వెలువడిన 4 వ సంపుటము 13, 14 సంచికలను కృతజ్ఞతతో నందుకొంటిమి.



## మచిలీపట్టణము

డిశంబరు 6:— బెజవాడ, బందరు మధ్య ఇప్పుడున్న, మీటరుగేజి రైలుతోబాటు ప్రక్కను ఇంకొక పట్టావేసి బ్రాడ్‌గేజి, పెద్దబండికూడా పోవునట్లు తమ స్వంతఖర్చుమీద ఏర్పాటుచేయుటకు కృష్ణాజిల్లా బోర్డువారు ఇటీవల తీర్మానించుకొని, అందుకొరకై రైల్వేబోర్డువారి యనుమతిని కోరియుండిరి. కాని వారు ఏలనో తమ, యనుమతిని ఇవ్వక, నిరాకరించిరి. లోగడ ఒక పర్యాయము, బందరు ఓడరేవును బాగుపరచి యభివృద్ధిచేయు విషయమై, కృష్ణాజిల్లా బోర్డువారును రైల్వేవారును కోరియుండగా, ప్రభుత్వమువారు ఇట్లే నిరాకరించిన సంగతి పాఠకులకు తెలిసియే యుండును. చిరకాలమునుండి తూర్పు కోస్తాయందు మిక్కిలి ప్రఖ్యాతివహించిన యీచిరపట్టణముయొక్క పురోభివృద్ధికి ప్రభుత్వమువారు ఈరీతిగా మాటిమాటికి అడ్డుతగులుచుండుట ఏలనో గ్రహింపజాలకున్నాము. లోగడ, రైల్వేవారు తమ స్వంతఖర్చులమీద, బందరు ఓడరేవువరకు రైలువేసికొందమన్నను, సర్కారువారు ఒప్పుకొని యుండలేదు. వీటినన్నిటిని పట్టిచూడగా, ప్రభుత్వమువారు, రైల్వేరాష్ట్రప్రజల ఆర్థిక, వాణిజ్యాది ఔకర్యములకు బుద్ధిపూర్వకముగా అడ్డుతగులుచున్నట్లు వూహింపవచ్చునున్నది. రైల్వే రాష్ట్రమునకు నలుప్రక్కల ఎట్లు చూచిన సముద్రములేదు. అట్టిదానికి మిక్కిలి చేరువలోనున్న బందరు రేవుకు సులభముగు రాకపోకలకు ఔకర్యము లు కలిగించినయెడల, తత్ రాష్ట్రప్రజల కెంతో లాభకరమనుట నిర్వివాదము. కావున ఈవిషయము, ప్రభుత్వమువారు తిరిగి ఆలోచించి, రేవు పట్నమును తద్వారా రైల్వే రాష్ట్రప్రజల భాగ్యమును పెంపొందింతురుగాక!

(ఒక విలేఖరి)

## బెంగుళూర్ అమెచూర్ డ్రామెటిక్ అసోసియేషను

చెన్నపురిలో నాటకములు ప్రదర్శింపబడుట

ఈసభవారు చెన్నపురవాసులకు చిరపరిచితులే. వీరు ప్రతిసంవత్సరము డిసెంబరులోగాని జనవరిలోగాని చెన్నపురికి వచ్చి 4,5 నాటకములను ప్రదర్శించి నగరవాసుల వావందింపజేయుచున్నారు. ఈసంఘమునకు తలమానికము సుప్రసిద్ధ నటశేఖరుడును బళ్ళారిలో న్యాయవాదియునగు శ్రీమాన్ టి. రాఘవాచారిగారు. వీరిటీవల ఐరోపాఖండమునందు సంచారముచేసి వచ్చినపిమ్మట స్త్రీ పాత్రలను స్త్రీలే ధరింపవలెనను విషయమునకై చాలపట్టుదలను వహించిరి. అందులకు తగిన సమర్థత గల సోదరీమణుల సహాయమునుగూడ బడసిరి. ఈ కీసంవత్సరమునగూడ యీనెల 11,12,13 తేదీలలో ఎగ్మూరులోని మ్యూజియం నాటకశాలలో ప్రహ్లాద, సుభద్ర, అభినవసారంగధర (త్రిపురారిది) అనునాటకములను ఆంధ్రభాషలో ప్రదర్శింపనున్నారు. ఈకడపటి నాటకము శ్రీయుత పి. వి. రాజమన్నారు బి. ఏ. బి. ఎల్. గారి (చెన్నపురి) చే వ్రాయబడినది. శ్రీమతి సరోజినీదేవి శ్రీమతి అన్నపూర్ణాదేవిగార్లు ప్రధాన స్త్రీపాత్రలను శ్రీయుత రాఘవాచారిగారు మున్నగువారు ప్రధానపురుషపాత్రలను ధరించెదరని తెలుపగలిగినందుల కెంతయు సంతసించుచున్నాము.

### కాకినాడ ముద్రాక్షరశాల కాలెండరు :—

ఇది మిక్కిలి అందముగాను పెద్దదిగానుగూడ నున్నది. కలకొక పెద్ద బొమ్మకలదు. ఇందనేకముఖ్యవిషయములు కలవు. తక్కిన కాలెండరులలో లేని యంశములుకూడ పెక్కు లిందుగలవు.

## త్రిలింగపత్రిక-మహాత్మ దూషణము

సనాతన ధర్మసముద్ధరణమే తన యాశయమని ప్రకటించు త్రిలింగపత్రిక శ్రుతిస్మృతిపురాణేతి హాసములయందలి ధర్మవిషయములను వెల్లడిచేసి ప్రజలను ముముక్షువులనుగా జేయుటకు బదులు దేశములోని మహా నాయకులను దూషించుటయందు తన జీవితమును గడపుకొనుచున్నది. శారదా శాసనమును నిర్మూలించుటకు న్యాయసమ్మతమగు వివిధ ప్రయత్నముల నీపత్రిక యొనరింపవచ్చును. కాని తన ప్రతికక్షులలో మిక్కిలి నీచమైన పొక్కు దూషణవాక్యము మనజాలని లోకోత్తరపురుషుడగు గాంధిమహాత్ముని కసితీర తిట్టుట యీ పత్రికకు తగినదికాదు. ఇట్టి దూషణమును సనాతనధర్మ మంగీకరించునా? ఋషితుల్యుడగు మహాత్ముడు భారతమాత గర్భమున జన్మించినందులకు గర్వమునకెంది యిట్టి మహాత్ముని దూషించి స్వదేశౌన్నత్యము లోకమున కెల్లెడలను ప్రకటించుకొనుటకు మారు క్షేత్రలోకపీడితుడు సూర్యప్రభను గాంచలేక దానిని నిందించునట్లు ఈ పూర్వాచారపరాయణులు మహాత్మునియందలి సుగుణపుంజమును గాంచజాలక యాతని నిందింపగడంగుట వీరి సంకుచితబుద్ధిని అతిమద్వర్గద్వారతను వెల్లడిచేయుచున్నది. ఇతరుల సుగుణములను ప్రకటించి వారి లోపముల నెన్నకుంట సజ్జనధర్మము. వీ రట్లుచేయక దేశకాలపరిస్థితులనుబట్టి లోపములుగా నెంచదగని మహాత్ముని కొన్ని కార్యములను వీరు మహా పాపములనుగా నెంచుచు వానినిమాత్రమే ప్రకటించి మహాత్ముని నోటికివచ్చినట్లు తిట్టి కృతకృత్యులమైతిమని భావించుకొనుచున్నారు. శత్రువులచే గూర్పబడిన సత్కీర్తి దూషణవాక్యమునజాలక, దైవపరుడై ధర్మమని తాను స్థిరముగా నమ్మినదాని నాచరించుచు ఆచరించినదానిని ప్రకటించుచు తప్పొనరించినప్పుడు క్షమార్పణ చెప్పుకొని ప్రాయశ్చిత్తము చేసికొనుచు, నిరాడంబర జీవితమును గడపుచు మానవసేవయే దైవసేవయని నమ్మి మహాత్ముని నిందించి, వీరు నిజముగా తమయొక్కయు తమ దేశముయొక్కయు గౌరవమును మంటగలుపుచున్నారనుటలో నతిశయోక్తిలేదు. కార్యకారణసందర్భముల నించుకయైన విమర్శింపక మహాత్ముడు గోహత్య యొనరించెననియు, ధర్మశాస్త్రములను మూలవారవేయు డని చెప్పెననియు, సబర్మతీ యాశ్రమమున బ్రాహ్మణులచే నీచకర్మలు చేయించెననియు మొదలగు నిందారోపణములను చేయుచున్నారు. పూర్వాపరముల నరయనిచో శ్రీ రామచంద్రుడు రావణుని సంహరించుటచే బ్రహ్మహత్య గావించెనని యనవచ్చును. 'మామేకం శరణం వ్రజ' యను భాగమునువదలి 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య' యను భాగమును మాత్రము గ్రహించి శ్రీకృష్ణుడు అన్ని ధర్మములను వదలివేయుచున్నాడని వాదింపవచ్చును. కాని యీవిధముగ నపార్థములను దీసి దైవనింద చేయుట కేమానవుడైనను పూనుకొని యిట్టివాదు లీవింపగలడా? సందర్భముల నరసినచో గాంధి మహాత్మునియెడల చేయబడిన నిందారోపణములన్ని అర్థశూన్యములని తెలుగగలదు. ధీరులు న్యాయమార్గమును వీడజాలరు. గాంధిమహాత్ము డట్టి ధీరుడు.

నిందంతు నీతినిపుణా యది వా స్తువంతు
లక్ష్మీ స్సమా విశతు గచ్ఛతు వా యథేష్టం
అద్యైవ వా మరణమస్తు యుగాంతరే వా
న్యాయాత్పథః ప్రవిచలంతి పదం నధీరాః

సనాతనధర్మపరాయణులమని చాటుకొనువారికిట్టి లేని లోపములను ప్రకటించుట యుచితముకాదు. కావున వారును స్వశక్తిదూషణమును మాని తమలము ధర్మసంస్థాపనయందే తమ శక్తిసంతయు వినియోగింపవలెనని వేడుచున్నాము. దూషణాగర్భితములగు వ్యాసములను ప్రకటించి త్రిలింగపత్రిక తన యశస్సును వృద్ధిపరచుకొనజాలదు.

విద్వాన్ వారణాశి రామబ్రహ్మం,
సోదుమూడి, కొత్తపేట, తూర్పు గోదావరి.




# సంశయనివారణము

తక్షణ అధినివేశస్వాతంత్ర్యమునకు బ్రిటీషు లేబరు ప్రభుత్వమువారు అనుకూలు రను భ్రమ మితవాదులు మున్నగువారి నింకను ఆవరించి యున్నచో, ఇండియాసహాయమంత్రి యగు రస్సెలు ప్రభువుగారు నుడివిన విషయములు సంశయవిచ్ఛేదము గావింపగలవు. రౌండుటేబిలు సమావేశమున పాల్గొన నిరాకరించిన గాంధిమహాత్ముడును పండిత మోతీలాల్ నెహ్రూగారును దూరదృష్టి జూపి రని విదిత మగును. అధినివేశస్వాతంత్ర్యము ఇప్పుడు గాని, ఇంకను చాలకాలమువరకుగాని సాధ్యపడ దని, లేబరు పక్ష సమావేశమునందు ఇండియా సహాయమంత్రి నుడివెను. లేబరు ప్రభుత్వమువారు సైమనుకమీషను సూచనలనే ఆధారపరచికొని, సంస్కరణములను నిర్ణయించెద రని యూహింపవచ్చును. అధినివేశస్వాతంత్ర్యమును వెంటనే ప్రసాదింపవలయు నని, మితవాదసమావేశమువారు తీర్మానించియుండిరి. రస్సెలు ప్రభువుగారి నుడువులు అన్ని పక్షములవారికిని ఆశాభంగము కలిగింపకమానవు. లేబరుపక్షమువారు వివేకహీన మగు తీర్మానముల వలన గాని, ప్రచారమువలనగాని, మారిపోవరని, రస్సెలు ప్రభువుగారు గొప్పచెప్పుకొనిరి. కాని, ఒక్కసంగతిమాత్రము నిశ్చయము. భారతీయులు స్వశక్తిని పెంపు జేసికొనుకొలదియు, ప్రభుత్వవైఖరి గూడ మార్పుచెందకమానదు. రస్సెలు ప్రభువుగారి నుడువులమూలమున, భారతీయులకు లేబరు పక్షానుగ్రహముపై నాధారపడి ప్రయోజనములేదని, తేటపడక మానదు.

లాహోరు కాంగ్రెసు సభ దూరదృష్టి జూపియే, పూర్ణస్వరాజ్యమును లక్ష్యముగ నుంచికొనెనని స్పష్ట మయినది. ఇండియా సహాయమంత్రిగారు, కాంగ్రెసు వివేకమును కోల్పోయెననియు, బుద్ధిలేనితీర్మానముల గావించెననియు జెప్పి, తమ ఆగ్రహమును వెలిబుచ్చవచ్చును. కాని ఇట్టి ఆగ్రహావేశమువలన హైందవసమస్య పరిష్కారము గాంచదని, వీరు గ్రహింపవలయును. భారతీయాశయము లేవంకకు పరుగిడుచున్నవో వీరు గ్రహించుట లాభకర మగును. భారతదేశ మికమీద బ్రిటీష్ప్రముఖులేమని తలచుచున్నారో, ఎటుల భావించుచున్నారో యని, విచారింప నవసరము లేదు. తనశక్తిని పెంపుచేసికొని, స్వాతంత్ర్యము బడయు టెటు లని మాత్రమే యోచింపవలయును. కాంగ్రెసు తీర్మానములు, ఇండియాసహాయమంత్రిగారికి రుచింపనిచో, మితవాదుల నీసమయమున దరి జేర్పవలయు నని, వీరు తలచుచో, వెంటనే అధినివేశ స్వాతంత్ర్యమొసగ ప్రయత్నించినను, వీరి నుడువులకు కొంత యర్థ ముండును. సంపూర్ణస్వాతంత్ర్యతీర్మానము వివేకరహితమనియు, అధినివేశ రాజ్యస్వాతంత్ర్యము నయినను చాలకాలమువర కిచ్చుటకు వీలులేదనియు, వీరు చెప్పుటచే, వీరిపై ఆశ బెట్టుకొని ప్రయోజనము లేదని తేలును. ఇండియాసహాయమంత్రిగా రిప్పుడయినను తమ మనోభిప్రాయమును స్పష్టముగ వెల్లడిచేసి, సంశయనివారణ గావించినందుకు, వారికి దేశము కృతజ్ఞత జూపవచ్చును.

మితవాదు లికమీద కాంగ్రెసును అనవసరముగ నిందింపక, దేశస్వాతంత్ర్య సంపాదనకై కాంగ్రెసు సలిపెడి ప్రయత్నములకు వీ లగునంత వరకు తోడ్పడి, ఎట్టి నిరోధము గలిగింపకుండుటమే లగును. తక్షణ అధినివేశస్వాతంత్ర్యము నాధారము జేసికొనని రౌండుటేబిలు సమావేశమునకు బోకుండుటకు తీర్మానించి, కాంగ్రెసు మహాసభ తన ఆత్మగౌరవమును నిలుపుకొనినది. గాంధిమహాత్ముడును పండిత మోతీలాల్ నెహ్రూగారును ముఖ్యమయిన అధినివేశస్వాతంత్ర్యవిషయపు షరతు గూర్చియే కాంగ్రెసు తరఫున రాజప్రతినిధిగారితో ప్రస్తావించిరి. ఇతరవిషయములను వా రెత్తుకొనలేదు. ముఖ్యవిషయము గూర్చి సమాధానము కుదురనందుచే, వారు రౌండుటేబిలు సమావేశములో పాల్గొన నిరాకరించిరి. సర్ సప్రూగారును, ఇట్టిషరతు నిదివర కామోదించినవా రగుటచే, వారు గూడ రౌండుటేబిలు సమావేశమును నిరాకరించి యుండవలసినది. కాని సందిగ్ధసమయమున వారు వెనుదగ్గి, ఢిల్లీ నాయకప్రకటనమును నిష్ఫలము గావించిరి. దక్షిణాఫ్రికానాయకు లగు స్మట్సు సేనానిగారు బ్రిటీషు సామ్రాజ్యపు లాభములను ఏకరువు బెట్టుటతో తృప్తి జెందక, హిందూదేశపు అసహనమును సహనముతోను, అవివేకమును వివేకముతోను, ఎదుర్కొని, అధినివేశ స్వాతంత్ర్య సూత్రముద్వారా హైందవసమస్యను పరిష్కరింపవలె నని కోరుచున్నారు. హిందూదేశమునకు ఇట్టి స్వాతంత్ర్యమును వెంటనే ప్రసాదింపవలెనని యైనను వీరు కోరక లక్ష్యమును మాత్ర మంగీకరించుచున్నారు. దక్షిణాఫ్రికాస్వాతంత్ర్యము ననుభవించుచున్నపుడు ఇతర దేశముల గూర్చి వీరు శ్రీరంగనీతుల నెన్నిటినయినను జెప్పవచ్చును. వీరిది కడుపు నిండిన బేరము. హిందూదేశభావిస్థితిని నిర్ణయించుటకు, ఇంగ్లండుకే గాక, దక్షిణాఫ్రికా, కెనడా మున్నగు వలస రాజ్యములకు గూడ అధికార మున్న దని, స్మట్సుగారు భావించినటుల వీరి ప్రసంగధోరణిబట్టి గ్రహింపవచ్చును. ఇట్టి నుడువులు భారతీయులలో పూర్ణస్వరాజ్యవాంఛను బలపరుచుట సహజము.

## డెమోక్రటిక్కు పక్షము

కాంగ్రెసు వర్కింగు కమిటీలో కొందరకు సభ్యత్వము దొరకనంతమాత్రమున, వేరొకపక్షము నేర్పరచుట ఎంత అసభ్యమో దెలుపనక్కరలేదు. కాంగ్రెసుకన్నను, ఈ పక్షమునకు భిన్నమగు నాశయములును గనుపింపవు. చెన్నపురిలో నూతనపక్షమునకు పట్టుగొమ్మలగు శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారును, సత్యమూర్తిగారును హిందూపత్రికా ప్రతినిధితో జెప్పినవిషయముల గాంచిన, కాంగ్రెసుపట్ల భక్తి గలవారెల్లరకును విషాదము గలిగింపక మానవు. సంపూర్ణస్వాతంత్ర్యమును లక్ష్యముగ గైకొని, శాసనసభల బహిష్కారము నామోదింపని పక్ష మొకటి బయలుదేరునేమో తమకు దెలియ దనియు, ఈ విషయము రాబోవు డెమోక్రటిక్కు పక్షసభలో నిర్ణయింపబడు ననియు, శ్రీనివాసయ్యంగారు నుడివిరి. సత్యమూర్తిగారు తమ యభిప్రాయము నింతకన్నను స్పష్టముగ దెలిపిరి. అధినివేశస్వాతంత్ర్యము నాధారము జేసికొను రౌండుటేబిలు సమావేశమునకు కాంగ్రెసుసభ్యులు వెడలవచ్చునని, వీ రభిప్రాయపడుచున్నారు. ఇకముం దట్టిసమావేశములకు వెడలుట తప్పనియు, సంపూర్ణ స్వరాజ్యాధారము ననుసరించియే పరిష్కారము కుదురవలయు ననియు, గాంధిమహాత్ముడు తేటపరచి యుండెను. లాహోరు కాంగ్రెసు సభ శాసనసభా బహిష్కారము నామోదించుటలో గొప్పతప్పొనర్చె నని, సత్యమూర్తిగారు నుడివిరి. ఈతీర్మానము చెడ్డది గాన, దీని నుల్లంఘించి సత్యాగ్రహము నవలంబింప వలయు నని, సత్యమూర్తిగారు నుడువుటబట్టి, నూతనపక్షము నేర్పరచుటకు వీరిని ప్రేరేపించిన యాశయ మెద్దియో గ్రహింపవచ్చును. కాంగ్రెసుపై సత్యాగ్రహమును నడుపుటకు సత్యమూర్తిగారు నాయకత్వమును వహించెదరు గాబోలు. ఇప్పు డొకవేళ రాజీనామా నిచ్చినను, మరల ఎన్నికలకు నిలచి శాసనసభలలో చేరవలయు నని వీరు గోరుచున్నారు. సంపూర్ణస్వాతంత్ర్యమును గూర్చి చాలకాలమునుండియు పట్టుదల జూపుచున్న వీరు శాసనసభలద్వారా యిట్టిలక్ష్యమును చేరవలయు నని భావించియున్నచో, వీరి యభిప్రాయముల కెట్టివిలువ యుండునో యూహింపవచ్చును. ఈ సమయమున మద్రాసు శాసనసభ్యు లగు కాళేశ్వరరావుగారును కరాంతు గారును గావించిన హితోపదేశము అమూల్యమై యొప్పుచున్నది. కాంగ్రెసుసభ్యులు తమపదవులకు రాజీనామా నిచ్చుట కింకను కాలయాపన జేయుట గూడ దనియు, కాంగ్రెసు తీర్మానముబట్టియే వీరి కర్తవ్యము నిర్ణయమయ్యెననియు, కాంగ్రెసు ప్రముఖులు తమసభ్యత్వములకు, రాజీనామా నిచ్చి మరల వ్యక్తిపరముగ ఎన్నికలకు నిలుచుట కాంగ్రెసును బలహీనపరచుటయే యగు ననియు, అందుచే కాంగ్రెసు సభ్యుల వ్యక్తిగతాభిప్రాయము లెటులున్నను కాంగ్రెసు తీర్మానమును శిరసావహించి పనిజేయుటయే, కాంగ్రెసుపక్షమువారి కర్తవ్య మనియు, కాళేశ్వరరావుగారు సోదరసభ్యులకు హిత వొసగిరి. కానియెడల, కాంగ్రెసు పనులు కొనసాగుట దుర్లభమని, వీరు చాటిరి. కాంగ్రెసు ఆజ్ఞలను నిర్వహింపనిచో, కాంగ్రెసు పక్షసభ్యులు నగుబాట్ల పాలయ్యెద రని, కరాంతుగారు స్పష్టపరచుచు, తమ రాజీనామాను వెంటనే పంపివైచిరి. ఈ విషయమును నిర్ణయించుటకు పక్షసమావేశముతో బనిలేదని, వీరు తేటపరచిరి. కాంగ్రెసు చరిత్రలో అత్యంతముఖ్యమయిన తీర్మాన మామోదింపబడిన సమయమున, వేరొకపక్షమును లేవదీయుట, అనర్థహేతు వనియు, వ్యక్తుల అభిప్రాయభేదములు కాంగ్రెసు సంస్థకు నష్టహేతువుగ పరిణమింపగూడ దనియు, ఇందువలన, కాంగ్రెసు ప్రతిపక్షులకు సంతసము గలుగుట దప్ప వేరులాభము గలుగదనియు, కరాంతుగారు సూచించుటయే గాక, ఇట్టిపక్షములతో తమకు సంబంధము లేదని ప్రజలకు తేటపరుపవలయునని, కరాంతుగారు చేసిన

ఎచ్చరిక చాల ముఖ్యమయినది. కాంగ్రెసునందు రెండు పక్షములు ఏకడము లేదనుట నిస్సందేహము. నూతన సంవత్సరమునందు స్వాతంత్ర్యసిద్ధికై తదేకదీక్షతో పాటు బడవలసియుండ, భిన్నపక్షములతోను వాదప్రతివాదములతోను ప్రొద్దుబుచ్చుట కవకాశ ముండదు. గాంధి మహాత్ముడు మాటలతో కాలము గడుపుట కిష్టపడడు. సంపూర్ణస్వాతంత్ర్యమును గాంధిమహాత్ము డంగీకరించుటకు చాలకాలము వెనుదగ్గెను. ఇందుకై పోట్లుబడుటకు ప్రజలకు శక్తి గలదను విషయమై వారికి సందియము దోచెను. కాని, కలకత్తా కాంగ్రెసు సభలో ఏడాదివరకు వేచియుండి అధినివేశస్వాతంత్ర్యము లభింపనియెడల, తాను సంపూర్ణస్వాతంత్ర్యవాది నయ్యెదనని వాగ్దానము జేసియుండెను. మొదట వీరు రెండుసంవత్సరముల గడువును సూచించిరి. కాని, రెండుసంవత్సరముల గడువుకు సభ్యులు సమ్మతింపకుండుటచే, ఒక సంవత్సరపు గడువుకే వీరు సమ్మతింపవలసివచ్చెను. రౌండుటేబిలు సమావేశమునకు మహాత్ముడు నాల్గు షరతులను సూచించినపుడేమి, రాజప్రతినిధిగారితో సంప్రతింప నున్నపుడేమి, మహాత్ముడు మితవాది యగుచున్నాడనియు, లాహోరు కాంగ్రెసుసభలో గూడ వీరు నిరుత్సాహమును వ్యాపింపజేసెదరనియు, నిందించిన సంపూర్ణస్వాతంత్ర్యవాదులు గలరు. అట్టి మహాత్ముడు లాహోరుసభలో సంపూర్ణస్వాతంత్ర్యమును స్వయముగ ప్రతిపాదించి, దానిని సభవారిచే నామోదింపజేసి, శాసనసభాబహిష్కారమును సూచించి, దేశప్రముఖులెల్లర శక్తులను స్వాతంత్ర్య సంపాదనమునకై వినియోగింప గోరినపుడు, వారి నిదివరకు నిరసించుచుండిన సంపూర్ణ స్వాతంత్ర్యవాదులు నేరొకపక్షము నేర్పరచి, శాసనసభలను బహిష్కరింప వీలులేదనియు, కాంగ్రెసు తీర్మానమును ఉల్లంఘించి, దానిని నిష్ఫలము గావింపవలయు ననియు, ఎచ్చరించుటకన్నను వింతె నెరుండదు. ఇట్టివారి ననుసరించి, దేశము గమ్యస్థాన మెన్నటికిని చేరనేరదు. అందుచే భారతీయు లెల్లరును అందు ముఖ్యముగ ఆంధ్ర మహాజనులును, గాంధి మహాత్ముని నాయకత్వము ననుసరించి, కాంగ్రెసు తీర్మానములు సఫల మగునటుల జూచుట ధర్మము. భిన్నమార్గములును, భిన్నవాక్కులును ఈ సమయమున ప్రజల కేమాత్రము తోడ్పడజాలవు. కాంగ్రెసు సభ్యులు తమ సభ్యత్వముల కీ సమయమున రాజీనామా నిచ్చి, తిరిగి కాంగ్రెసేతరులుగ ఎన్నికలకు నిలువవలయు నని చేసెడి సలహా, మిగుల హానికరము. శాసనసభలద్వారా మోక్షము చేకూరునని, ఈ సమయమున నమ్మువా రుండరు. వానివిలువ యిదివరకే వెల్లడి యయ్యెను. శాసనసభలవలన స్వల్పలాభములు చేకూర వీలయినను, స్వాతంత్ర్యసిద్ధి కివి దారిజూపుటకు మారుగ, తత్ప్రతిబంధకములుగ పరిణమించునని, అనుభవము తేటపరచెను. మంత్రి పదవుల నంగీకరించినగాని ముక్తి లేదనువారుగూడ వీరినుండి బయలుదేర సాగిరి. కాంగ్రెసు తీర్మానములను శిరసావహించి వానికి తోడ్పడుటచేతనే, కాంగ్రెసు గౌరవము ఇనుమడించుటయు, ప్రజాభీష్టములు సిద్ధించుటయు, జరుగును. అందుకు మారుగ, ఎవరికివారే యని ప్రవర్తించుచో, దేశస్వాతంత్ర్యముపట్ల ఎట్టి ఆశ గలుగజాలదు. ఈ సంగతిని గుర్తించి కాంగ్రెసు ఆజ్ఞల కెట్టిభంగము వాటిల్లకుండను, మహాత్ముని నాయకత్వమున కెట్టి అంతరాయము గలుగకుండను, ప్రజలు మెలగెదరుగాక! ఆంధ్రు లీవిషయమున మార్గదర్శకులై తమకీర్తిని నిలువబెట్టుకొనెదరుగాక!

---

నౌకల యజమానుల సమావేశము :

ప్రభుత్వప్రకటనము

ఢిల్లీలో గూడిన నౌకల యజమానుల సమావేశము విఫలమయ్యె నని నిన్నటిదినము సూచించియుంటిమి. ఈ విషయమై ప్రకటన మొకటి వెలువడెను. తీరవ్యాపారపు సాధకబాధకములను సమావేశమువారు చర్చించిరనియు, పరిష్కారమార్గము లనేకములు సూచింపబడెననియు, బ్రిటీషు ప్రతినిధులకును, హైందవప్రతినిధులకు మధ్య దాటరాని భేదము లుండుటచే, పరిష్కారము కుదురలేదనియు, ప్రకటనము దెలుపుచున్నది. ఉభయులమధ్య పరిష్కారము కుదురుటకు, రాజప్రతినిధిగా రెంతవరకు తోడ్పడెదరో ఈ ప్రకటనము బట్టి గ్రహింప వీలు గలుగుటలేదు. పైసమావేశమునందు జరిగినచర్చలో బయల్పడిన విషయములను ప్రభుత్వమువారు ఆలోచనలోకి దీసికొందురని, ప్రభుత్వ ప్రకటనము దెలుపుచున్నది. కాని, మరల నిట్టి సమావేశమును కూర్చెదమని, ప్రభుత్వమువారు వాగ్దాన మొసగరయిరి. తా మేచర్య దీసికొనునదియు ముందు నిర్ణయించెదమని, వీరు చాటిరి. ప్రభుత్వప్రకటనము, తీరవ్యాపారచట్టము విషయమున ఎట్టి యాశ గలిగింపకున్నది. బ్రిటీషు ప్రతినిధులు కోరిన మితమీరిన కోర్కెలను ప్రభుత్వమువారు బలపరచినటుల గనుపించును. బ్రిటీషునౌకలను భారతీయులు కొనవలయు ననియు, అంతవరకు ఎట్టి నౌకలను హిందూదేశమునిర్మింపరాదనియు, షరతుబెట్టుట, విరుద్ధము. హిందూదేశతీరవ్యాపారమును ప్రోత్సాహపరుపదలచుచో, హాజీగారి చట్టమును ఆమోదించుట ప్రభుత్వమువారికి ధర్మ మగుచున్నది. అందుకు మారుగ, బ్రిటీషుయజమానులు చేసెడి ఆర్భాటములకు లొంగి, యిట్టి యుపయోగకరమగు చట్టమును ప్రభుత్వము నిరోధించునెడల, ప్రస్తుతసందర్భములలో హిందూదేశము తనవ్యాపారమును తాను రక్షించుకొనజాలదను విశ్వాసము ప్రబలకమానదు. దేశస్వాతంత్ర్యసిద్ధి చేకూరువరకు, ఇట్టి చట్టము లమలులోనికి రాజాలవని, తెల్లమగును. అన్ని దేశములకును తమ తీరవ్యాపారమును కాపాడుకొనుటకు హక్కు గలదు. అట్టిహక్కు హిందూదేశమున కుండరాదని, బ్రిటీషు వర్తకులు గగ్గోలుబెట్టుటకు, స్వార్థపరత్వము దప్ప వేరు కారణము కనుపింపదు.

---

అస్సాం పోలీసు

అస్సాం శాసనసభవారిచే నియమింప బడిన సివిలు పోలీసు కమిటీవారు, ప్రచురించిన నివేదికము, పోలీసు శాఖయొక్క నిజస్థితిని తేటపరుపగలదు. పోలీసువారికిని ప్రజలకును మధ్య ఉండవలసిన సంబంధము తృప్తికరముగ లేదని, కమిటీవారు నిరూపించిరి. సహకార విశ్వాసములకు బదులుగ అవిశ్వాసమును, భీతియు వ్యాపించెనని, వీరు దెలిపిరి. ఇందుకు కారణ మేమి? పోలీసువారు తమకుగల అధికారములను దుర్వినియోగము చేయుటయే యని, కమిటీవారు నమ్ముచున్నారు. పోలీసువారు ప్రజాసేవకుల మని గ్రహించి, ప్రజలయజమానుల మనుభావమును విడనాడునెడల, పరిస్థితులు చక్కబడు నని, కమిటీవా రభిప్రాయపడిరి. కాని, ఇట్టిభావము గలుగవలె ననిన, పరిపాలనవిధానము మార్పు చెందవలయును. ఇది కొనసాగిన గాని, పోలీసువైఖరి మార్పు చెందునని తోచదు. లా-ఆర్డరుశాఖలు ప్రజలవశము గావలసిన యవసరము విదితమగుచున్నది. ఇండియా మంత్రిగా రీటీవల కామన్సుసభలో ముచ్చటించుచు, ప్రజల సద్భావమే లా-ఆర్డరులకు ప్రధానాధారముగాని, యూనిఫారముతో నున్న పోలీసు భటులు గారని తేటపరచియుండిరి. ఇట్టి సత్యమును గుర్తించుటకు, స్వపరిపాలనస్వాతంత్ర్యమే దేశమునకు తోడ్పడగలదు. స్వల్పపు మార్పు లిందుకు తోడ్పడజాలవు.

---

26 వ జనవరి

26 వ జనవరి తేదీ సంపూర్ణస్వరాజ్యదినముగ పరిగణించి, ఆ రోజున నూతనలక్ష్యమును వెల్లడిజేయుటకు పట్టణములలోను పల్లెలలోను సభలు జరుపవలెననియు, ఇందుకుగాను, రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములును, మండల, స్థానిక కాంగ్రెసుసంఘములును శ్రద్ధవహింపవలయు ననియు, స్వాతంత్ర్యపతాకము నాదినమున ఎగురవేయ వలయుననియు, సాయంకాలం బహిరంగసభల జరుపవలయు ననియు, కాంగ్రెసు సభాధ్యక్షు లగు పండిత జవహరిలాల్ నెహ్రూగారు విజ్ఞప్తిని ప్రకటించిరి. కాంగ్రెసు సభాధ్యక్షుని సందేశమును కాంగ్రెసు సభ్యులెల్లరు శ్రద్ధతో నిర్వహించి, స్వాతంత్ర్య సంపాదనాసక్తిని వెల్లడిజేసి, ప్రజలలో ప్రబోధము గావించెద రని నమ్మెదము. నేటిదినము జరిగెడి అమెరికా సినేటు సభలో, సినేటరు బ్లెయినుగారు హిందూదేశ సంపూర్ణస్వాతంత్ర్యమును వెంటనే గుర్తింపవలయు నని ప్రవేశపెట్టిన తీర్మానము చర్చకువచ్చు నని, కాంగ్రెసు కార్యాలయమునకు వర్తమానము చేరెను. ఇట్టి తీర్మానములవలన, హిందూదేశమునకు విశేష ప్రయోజన ముండజాలదు. భారతీయులు స్వశక్తిపై నాధారపడి కృషి సలుపుచో, అన్యులును తోడ్పడుటకు ముందుకువత్తురు. లేనియెడల, అన్యులుసహాయపడెదరని గాని, వారి సహాయమువలన విశేషలాభ ముండు నని గాని తలంప వీలు గనుపింపదు.

---

## వంగరాష్ట్రపు నాయకులపై రాజద్రోహపు నేరము

---

### ప్రాసిక్యూషను వకీలు వాదము

కలకత్తా, జన 6:—నేటిదినము అలిపూరు అడిషనలు మాజిస్ట్రేటు కోర్టునందు సుభాషుచంద్ర బోసుగారిమీదను మరికొందరిమీదను తేబడిన రాజద్రోహపు కేసు విచారణ జరిగెను. నిందితులపక్షపు వకీలు సాక్షుల నెవ్వరిని విచారింపనందున ప్రాసిక్యూషను వకీలు వాదమును ప్రారంభించెను. ఆగష్టు 11 వ తేదీన నిందితులు రాజకీయ నిర్బంధితుల ఉత్సాహమ సందర్భమున ఊరేగింపు జరిపిరనియు, ఆ సందర్భమున రాజద్రోహపూరితమగు కార్యములు గావించిరనియు చెప్పిరి. నిందితులు పంచిపెట్టిన కరపత్రములు వారి మనోభావములను వ్యక్తపరచుచున్నవని ప్రాసిక్యూషను వకీలు చెప్పెను.

ప్రాసిక్యూషను వకీలు వాదము ముగియుటకు పూర్వమే కోర్టు ఆదినమునకు చాలింపబడెను. (ఫ్రీ ప్రె.)

# గ్రంథ విమర్శనము

## తండ్రినుండి కుమార్తెకు జాబులు (ఆంగ్లము)

(Letters from a Father to his Daughter)

గ్రంథకర్త:—జవహరిలాల్ నెహ్రూగారు. ౧౨౩ పుటలు. దళసరి మెఱుగుకాగితములు. అట్టబైండు వెల తెలియదు.

ఇది యొక లోకజ్ఞాన ప్రదాయకమగు పుస్తకము. నెహ్రూగారు తమ పదేండ్లబాలిక యగు ఇందిరకు జాబుల మూలకముగా ప్రకృతిశాస్త్రములు, దేశచరిత్ర ఇత్యాది విషయములకు సంబంధించిన జ్ఞానమును తెలియజేసిరి. బాలబాలికల కీరీతిగా శాస్త్రములందును, చరిత్రలందును శాస్త్రముల మెలవడచేయుట కిట్టిగ్రంథము లత్యావశ్యకము. ఆంగ్లమునం దిట్టివికలవు గాని మన దేశభాషలందు లొత్తుగా లేవు. సమస్త విషయములలోను అగాధమైన జ్ఞానమును సేకరించిన యీకాలమునగూడ బాలబాలికలకు పూర్వకాలమునందు వలెనే తర్కమునకుగాని తత్త్వమునకుగాని నిలువలేని పురాణకథల పఠింపజేసి నీతిని, తత్త్వమును బోధింప జూచినచో, వాటి అర్థము గ్రహింపలేక వారి లేతమనస్సులు కాతావాలయును, జ్ఞానేచ్ఛను గోల్పోయి, జడము లగుచున్నవి. జ్ఞానమెఱుగని పసిబిడ్డలకు, నీతి, వేదాంతములయొక్క ప్రయోజనముకంటె ప్రాపంచికజ్ఞానము లెస్సగా కావలెను.

నెహ్రూగారీగ్రంథమందు ఖగోళభూగోళ చరిత్రలు, జీవోత్పత్తి, జలచర, భూచర, నరాదిజీవుల విషయము, జీవుల అనుకూల్య (Adaptation) విధానము, ధీశక్తిప్రయోజనము, రామాయణ భారత కాలములు ఇత్యాది సమస్తవిషయములను ఇందు సూక్ష్మముగా దెల్పియున్నారు. బాల బాలికల కత్యుపయోగమగు గ్రంథము.

ఈగ్రంథమందు పెక్కుముచ్చటైన చిత్రపటములు కలవు.

ఈగ్రంథమునకు హిందీఅనువాదము తయారగుచున్నదట. తెలుగులోనికి గూడ ననువదించిన లెస్సయగును.

దొరకుచోటు:—జవహరిలాల్ నెహ్రూ, అలహాబాద్-అని వ్రాయవలెను. చే. శా.

## రక్షాబంధనము

గ్రంథకర్త:—పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. 362 పుటలు. సాదాకాగితములు, అట్టబైండు. వెల 1-8-0. కలాభివర్ధనీ పరిషత్తునుండి ప్రకటింపబడినది.

ఇదియొక పారిశోధకనవల. పారిశోధకనవలలు ప్రస్తుతకాలమున సాంఘికనవలలతో సమానముగా కోరబడుచున్నవి. ఇట్టి నవలారచనలు నాగరికలక్షణము గాకున్నను ప్రస్తుతపరిస్థితులలో ప్రకృతిని మార్చుట కష్టము.

ఈగ్రంథమందు మనకు స్పష్టముగా రెండు వేర్వేరు కథలు కనబడుచున్నవి. ఈ రెండిటికిని ఐక్యమధికముగా లేదు. మొదటిది సాంసారికము, రెండవది పారిశోధకము. మొదటిభాగములోని పాత్రలు చాలమట్టుకు రెండవభాగములోనికి రారు. మొదటిభాగము యొక్క విషయము కేవలము సాంసారికము, రెండవభాగము పారిశోధకము. పూర్వభాగమందలి పాత్రలు ఉత్తములు, ఉత్తరభాగమునందు నీచపాత్ర లధికము. వ్యభిచారకుల మింకను మనదేశము దరుగుటలేదు. అయ్యదియే మన నాగరికస్థితిని విస్పష్టము చేయుచున్నది. రెండవభాగమునందలి స్త్రీపాత్రలు పదపూర్తులు. ప్రకృతిని బింబించుట కళలో కొరకయుంటము గనుక సాంఘికస్థితులు మారునవరకును మనము చేయగలిగిన దేదియు లేదు. ఇందలి అశ్లీలము హద్దులోనే యున్నది.

పురుషపాత్రలలో నరసింహము యొక్కయు, రెడ్డియొక్కయు ప్రజ్ఞాదిశేషములు వర్ణనాతీతములు. అగ్రారాయని విశాలహృదయమే కథయొక్క అనివార్యగమనమునకు కారణము. గ్రంథకర్తయొక్క ప్రజ్ఞ అగాధము గాకున్న నిట్టి సాంద్రకథాకల్పన, పరిపూర్ణ పాత్రపోషణ సాధ్యము కావు. శ్రీరామలు కేవలము సబలా పాత్ర గాక సజీవవ్యక్తియై యనిపించును. కాని సంభాషణలు మరపునకు రావు. మొత్తముమీద మనము పాత్రల మధ్య గాక నిక్కముగు స్త్రీ పురుషుల మధ్యనే తిరుగుచున్నా మనిపించును. శాస్త్రిగారి మౌలికత్వము (originality) అద్వితీయము.

ఇందలి పూర్వభాగమందలి స్త్రీపాత్రల విషయమేమన, గ్రంథవాసన లేమి వారల సంభాషణలు పంటిల్లు దాటవు. కాని వీరు ప్రకృతియందలి మనస్త్రీలవలె గాక, చమత్కారము, ధీశక్తి, సంభాషణ నైపుణ్యమును గలిగి కొంత మెచ్చదగి యున్నారు.

శైలి విషయము:—ఉపోద్ఘాతమందు గ్రంథకర్త శైలివిషయమై తన యుద్దేశమును పూర్తిగా వ్యక్తపఱచి యున్నారు. అందు శిల్పకళకు, కావ్యకళకు గల పోలిక గొంత చర్చించియున్నారు. అందు ఒకచిన్న లోపము కలదు. శిల్పచిత్రకళలకును కావ్యకళకును పోలిక సమగ్రము గాదు. ఆదేలయన, శిల్పచిత్రకళలు కావ్యకళకంటె ప్రకృతికి చేరువగా నున్నవి. ఉదా:—'ఓడ' అనుమాట తీసికొందము. ఓడ చిత్రమును వ్రాసిచూపిన యేజాతి వాడైనను, పసిబాలుడైనను, ఫలానావస్తువు యొక్క చిత్రమని పోల్చుకొనును. కాని ఓడ అనుమాటను వ్రాసినచో మనభాషరాని విజాతీయుడు గాని స్వజాతీయుడు గాని తెలిసికొనలేడు. అనగా భాషకంటె చిత్రము ప్రకృతికి సమీపములో నున్నది. చిత్రకళకంటె శిల్పకళ పదార్థసమన్వితమగుట ప్రకృతికి మరింతచేరువగా నున్నది. ఇప్పట్టున గ్రాంథిక వ్యావహారికముల విషయము చూతము: వ్యావహారికము సజీవము, గ్రాంథికము సజీవేతరము. గ్రాంథికమునకు మనుష్యుల భావనలో స్థానము గలదు. వ్యావహారికమునకు మనుష్యుల వ్యవహారములో స్థానము గలదు. అనగా గ్రాంథికము వ్యావహారికముకంటె ప్రకృతికి కొంచెము దూరములో నున్నదనుట. సాంఘికరచనలు వ్యవహారవిషయములు గనుక వ్యావహారిక భాషాప్రయోగమే ఎంతయు ఉచితము. గ్రాంథికము యొక్క విభాగము (roll) నిర్వచించుట కష్టము. కాని దానియొక్క తత్త్వము మాత్రము తేటపరచియున్నాము. మరియొక విశేషము: గ్రాంథికములో కృత్రిమ గ్రాంథికము, సహజ గ్రాంథికము అను విభజన చేయవచ్చును. సహజగ్రాంథికమునందు దీర్ఘసంస్కృత సమాసములు, మారుమూల పదములు, విపరీతాలంకారములు, అనవసర వ్యాకరణ బంధనలు దొర్లవు.

గ్రంథశైలినిగూర్చి వేరుగా చెప్ప నవసరము లేదు. అమృత ప్రవాహము. ఎంత త్రావిన 'ఇంకను త్రాగవలె ననిపించును—జాతీయములకు, స్పష్టతకు, సౌలభ్యమునకు చే. శా.

# స్వీకారము

## దాంపత్యము

(ఆంధ్రప్రకాశికా గ్రంథమాల ౧) రాయల్ సైజు. పుటలు ౧౯౫ చందాదారులకు అంచెకూలితో వెల రు ౧-౦-౦. సంపాదకులు: దొంతంశెట్టి నాగేశ్వరరావుగారు ప్రకాశకులు. విశ్వభారతీ అండు కో. వారు, ౪౫, బంధరువీధి, మద్రాసు.

## Thoughts on Diet

(ఆంగ్లము.) క్రౌను సైజు. ౪౭ పుటలు. వెల రు ౦-౭-౦.

గ్రంథకర్త: గౌరవనీయులగు న్యాయమూర్తి సర్ వేపా రామేశంగారు.

ప్రకాశకులు: The Indian Naturopathci Association, Bezwada

## South Indian Music Series Book 2 (Stage 3)

క్రౌనుసైజు. ౮౫ పుటలు. వెల ౦-౭-౦

గ్రంథకర్త పి. సాంబమూర్తిగారు, బి. ఎ., బి. ఎల్.

ప్రకాశకులు: The Indian Music Publishing House, G. T. Madras.

## శబరి (చిన్న నాటిక)

గ్రంథకర్త: వావిలాల గోపాల కృష్ణయ్యగారు, ఆంధ్రపత్రిక, చెన్నపురి.

ఇది 'గృహలక్ష్మి' మాసపత్రికయందు ప్రకటితమయినదానికి విడిప్రతి.

## సంగీత పార్వతీపరిణయము (అయిదంకముల నాటకము)

డిమ్మీసైజు. పుటలు ౬౯. వెల రు ౦-౭-౦.

గ్రంథకర్త: సత్యవోలు రాఘవమాధవరావుగారు. సకలానంద గ్రంథమాలిక, క్షేత్రపల్లి, పిఠాపురము, గోదావరిజిల్లా.

## అహల్యానవప్రాశమము (పదంకములనాటకము)

డిమ్మీసైజు పుటలు ౩౮. వెల రు ౦-౧౨-౦.

గ్రంథకర్త: కల్లూరి యజమాన వెంకటనారాయణరావుగారు, బి ఎ, అన్నవరపు. ఈగ్రంథము రాజమహేంద్రవరమున సరస్వతీ పవరుప్రెస్సున ముద్రితము.

## గ్రహతంత్రము

(జ్యోతిషసారస్వత తంత్రగ్రంథమాల—౨)

డిమ్మీసైజు. పుటలు ౨౬. వెల రు ౦-౬-౦.

సంపాదకుడు: రాచూరి వెంకట గోపాలరావుగారు, విజయనగరం.

## సత్యవ్రతి శతకము

క్రౌనుసైజు. పుటలు ౫౧. వెల రు ౦-౪-౦.

గ్రంథకర్త: భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు. ప్రకాశకులు: భాగవతుల లింగమూర్తి పంతులుగారు, ఛత్రపురము, గంజాంజిల్లా.

## My Mother's Picture

క్రౌనుసైజు. పుటలు ౨౬. వెల రు ౪-౦-౦.

గ్రంథకర్త: పండిత శ్యామసుందర చక్రవర్తిగారు. ప్రకాశకులు: కైలాసచంద్ర ఆచార్య, ౨౩, హారిసన్ రోడ్డు, కలకత్తా.

## శ్రీమదాంజనేయ జననము

క్రౌనుసైజు. ౩౫ పుటలు. వెల రు ౦-౫-౦.

గ్రంథకర్త: అమ్మనబ్రోలు వెంకట సుబ్బారాయ శర్మగారు, కేలంగి, తణుకుపోస్టు, పడమటిగోదావరి జిల్లా.

## దేవకీనందన శతకము

క్రౌనుసైజు. ౨౦ పుటలు. వెల తెలియదు.

ప్రకాశకులు: మిక్కాల వెంకటాచార్యులు గారు, సంస్కృత పండితులు, శ్రీచెన్నకేశవ కళాశాల గద్వాల సంస్థానము.

## ప్రణయపౌరభము

రాయల్ సైజు. పుటలు ౬౨ వెల రు ౦-౧౨-౦.

గ్రంథకర్తలు: కొండపల్లి గోపాలరావుగారు, వారి రామలింగశాస్త్రిగారు- కల్వపాముల, కాటూరుపోష్టు, కృష్ణాజిల్లా.

## వాదిరాజతీర్థగురుచరిత్ర

ఫూలుస్కేపుసైజు. పుటలు ౧౬. వెల ౦-౨-౦.

గ్రంథకర్త: ప్రొద్దుటూరి నరసింగరావుగారు, బి. ఎ., గురుప్రసాద(లచ్చిరాజువీధి)మార్యరావుపేట, కాకినాడ.

## శ్రీమదాంధ్ర మాతృశతకము

రాయల్ సైజు. పుటలు 33. వెల ౦-౪-౧.

గ్రంథకర్త: త్రిపురాన సత్యానందరావుగారు, ఉపాధ్యాయులు, గెడ్డియారు బ్రాంచిస్కూలు, No. ౭౮, దక్షరెండు స్ట్రీటు, బోగటాంగ్, రంగూన్.

## విజ్ఞానకందశతకము

డిమ్మీసైజు. పుటలు ౩౧ వెల ౦-౩-౦

గ్రంథకర్త: మదరాసు రాజారావుగారు, చీనాబజారు, బర్హంపురము, గంజాము.

## ఆత్మదర్పణము

(శ్రీవివేకానంద స్వామి ప్రణీతము) శ్రీ సనాతన గ్రంథమాల ప్రచురణము. క్రౌను సైజు. పుటలు ౮౩, వెల ౦-౩-౦.

మానేజరు, సనాతనగ్రంథమాల, సనాతనాశ్రమం, క్రాపపోష్టు, (via) కొల్లూరు, గుంటూరుజిల్లా.

## శ్రీమదాంధ్రోపనిషద్జ్ఞానదీపము - భా. ౧.

డిమ్మీసైజు. పుటలు ౨౩౮. వెల రు ౧-౮-౦.

గ్రంథకర్త: అమ్మనబ్రోలు వెంకటసుబ్బారాయ శర్మగారు, కేలంగి, తణుకుపోస్టు, పడమటి గోదావరిజిల్లా.

## శ్రీరామ పట్టాభిషేక నాటకము

రాయల్ సైజు. పుటలు ౧౦౦. వెల రు ౧-౦-౦.

గ్రంథకర్త: పాతాళభేది సుబ్రహ్మణ్యకవిగారు, క్షేత్రపీఠి, తిరుపతి.

## శ్రీమదాంధ్ర లింగపురాణము

డిమ్మీసైజు. పుటలు ౨౫౧, వెల తెలియలేదు.

గ్రంథకర్త: విద్వాన్ దువ్వురు చంద్రమౌళిశాస్త్రిగారు, ఆంధ్రోపాధ్యాయుడు, తాలుకాహైస్కూలు, తెనాలి.

# శాసనసభ్యుల రాజీనామాలు

## రామదాసుపంతులు, రంగస్వామి అయ్యంగారు, కె. ఆర్. కరంతుగార్ల ప్రకటనలు

స్టేటు కౌన్సిలుసభకు రామదాసు పంతులు గారును, అసెంబ్లీసభకు రంగస్వామిఅయ్యంగారును మదరాసు శాసనసభకు సామి వెంకటాచలంచెట్టి కరంతుగార్లను మదరాసునుండి రాజీనామాల నంపినట్లు నేడు తెలియవచ్చెను.

## సామి వెంకటాచలం చెట్టిగారి రాజీనామా

చెన్నపురి, జన 7.— శ్రీయుత సామి వెంకటాచలం చెట్టిగారు చెన్నపురి శాసనసభనుండి తమ సభ్యత్వమునకు నేడు రాజీనామా నొసంగిరి.

## గౌ॥ వేమవరపు రామదాసు పంతులుగారి రాజీనామా

వారు చేసిన ప్రకటన

మద్రాసు, జనవరి 7:— నేను నాయొక్క స్టేటు కౌన్సిలు సభ్యత్వమునకు రాజీనామా నొసంగితిని. అటులే యితర సభ్యులుకూడ రాజీనామా లొసగవలెనని వారిని కోరుచు వారలకు లేఖలను వ్రాసితిని. కొంతమంది యింతకుపూర్వమే రాజీనామా నొసంగియున్నారు.

1926 సం॥ స్టేటుకౌన్సిలునకు సభ్యులుగా ఎన్నుకోబడిన కాంగ్రెసు వాదులకును, 1926 సం॥ అసెంబ్లీకిని ఇతర రాష్ట్రీయ శాసనసభలకును ఎన్నుకోబడిన సభ్యులకును వారు గావించిన ఎన్నిక ప్రమాణములలో భేదము గలదు. 1925 సంవత్సరమునకు పూర్వము కాంగ్రెసు మహాసభ వారు ఎన్నికలు నిర్వహించలేదు. అయితే అప్పుడు శాసనసభలను పోరాడను బహిష్కారము మాత్రము రద్దుచేయబడి కాంగ్రెసు వాదులు తమ స్వంత బాధ్యతపై ఎన్నికలలో అభ్యర్థులుగా నిలుచుటకు అధికారము ఒసగబడెను. ఆ సమయమందు ఎన్నికలందు పాల్గొనిన కాంగ్రెసువాదులు అఖిలభారత స్వరాజ్యపక్షముయొక్క కట్టుదిట్టములకు లోనై యుండిరి గాని వారు 1926 సం॥ ఎన్నికలసమయమున కాంగ్రెసు వాదులు చేసిన ప్రమాణముల విధమున ఏప్రమాణమును గావించలేదు. కొందరు బహిష్కారవాదులు 1925 సం॥ ఎన్నికలసమయమున ఒక నియోజకవర్గమున ఇరువురు కాంగ్రెసువారు నిలిచినప్పుడు ఏదో ఒక వ్యక్తికి తమ సహాయ్యము, కొన్ని మరి ప్రత్యర్థియగు కాంగ్రెసువాది విరోధముగకూడ ప్రచారము సలిపి యుండిరి. ఇది జరుగుటకు కారణ మేమన, ఆసమయమున ఎన్నికలు కాంగ్రెసుయాజమాన్యమున జరగలేదు. ఈ విషయము యోచించి చూడ ఆ పరిస్థితులయందు ఎన్నికలలో విజయమొందిన నావంటివారును, నేనును ప్రస్తుతము మా సభ్యత్వములకు రాజీనామాల నొసగుటకు మా విధియని నేను నమ్ముటలేదు. అయినను 1925 సం॥ ఎన్నికలసమయమున కాంగ్రెసువాదులకు కాంగ్రెసుకీర్తియు, ప్రతిభయు వారి విజయము చేకూరుటయందు కారణభూతము గా నుండెను గనుక 1926 సంవత్సరమునుండి యీ కాంగ్రెసు వాదులు స్వరాజ్యపార్టీయందు మిళితమైనందునను కాంగ్రెసు కట్టుదిట్టములకు వ్యతిరేకముగా వీరలు నడచుకొనకూడదు. ఈ కారణములబట్టియే నావంటివారు రాజీనామాల నొసగితిమి. కనుక శాసనసభల బహిష్కార రాజీనామాలవిషయమై లాహోరు కాంగ్రెసు నిర్ణయములను అంగీకరించనివారు తమసభ్యత్వములకు రాజీనామాల నొసగి మరల కాంగ్రెస్సేతరపక్షముల పేరుతో ఎన్నికకు నిలువవచ్చునని అభిప్రాయపడుచున్నాను.

వి. రామదాస్ పంతులు

## కె. ఆర్. కరంతుగారు

మదరాసు కాంగ్రెసు కౌన్సిలు పార్టీ విప్ అగు కె. ఆర్. కరంతుగారు ఎం. ఎల్. సి. యిట్లు వ్రాయుచున్నారు:—

కాంగ్రెసు నిర్ణయమ్ము ప్రకారము నేను నా శాసనసభ్యత్వమునకు రాజీనామా పంపితిని. మా పక్షమునకు చెందిన సభ్యులందరును యిదివరకు రాజీనామాలను పంపకుండినచో యికముందు పంపెదరనియే నమ్ముచున్నాను. 'మంత్రులబిల్లులు ఆమోదింపబడునవరకు మనమింకను వేచియుండవలెనని డిప్యూటీలీడరు ఆర్. శ్రీనివాసయ్యంగారు 2వ తేదీ హిందూపత్రికలో వ్రాయుట చాల విచారకరముగ నున్నది. మనము మంత్రిపదవులను స్వీకరింపలేదు. వారికి మనమేల సహాయము చేయవలెను. శాసనసభలలో మనమున్నప్పుడు మనకు చేతనైనంత చేసితిమి. కాని కాంగ్రెసు యిట్లు నిర్ణయించిన పిదపకూడ యింకను వాదించుకొనుచుండుట హాస్యాస్పదముగ నుండును.

పక్షనాయకుడు పార్టీసభ జరుపరాదనియే నే కోరెదను. ఒక నిముషమైన ఆలసింపక యీ పక్షములో సభ్యులు ప్రతివారును రాజీనామాల నంపవలెను.

ఈ సందర్భమున క్రొత్తగ డెమొక్రాటిక్ పక్షమును స్థాపించిన కొందరు నాయకులచర్య విచారకరముగ నున్నది. కాంగ్రెసు యిట్టి మహత్తీర్మానమును గావించిన నాడే క్రొత్తపక్షము నేర్పరచుట చాల విచారకరము. ఈ పక్షము వారెన్ని పెద్దకబురులు చెప్పినను, అనాథులైన కొందరు ప్రత్యేకవ్యక్తుల సంతృప్తికొరకే పక్షము నేర్పడినది. కాని అవసరమునకు కాదని ప్రతివారును గ్రహింపగలరు. ఫలానివారు వర్కింగు కమిటీకి ఎన్నుకోబడనందున ఒక క్రొత్త పక్షము నేర్పడవలెనా? ఈ పక్షమును స్థాపించిన నాయకులు తాము చెప్పినట్లు యితరులు నడచుకొనవలెనని గోరుటకుమును తాము యితరులు చెప్పినట్లు ప్రవర్తింప నేర్చుకొనవలెను. కాంగ్రెసు వర్కింగు కమిటీకి తాము సహాయము చేయవలసిన సమయమున వీరు ఎదురుతిరిగి కాంగ్రెసు ప్రతిష్ఠకు భంగకరముగ ప్రవర్తించుట అవమానకరము. ఈ రాష్ట్రీయ ప్రజలీ యీపక్షమును నిరాకరించి, యిట్టి నూత్న అనవసరమనియు, కాంగ్రెసులో రెండుపక్షము లుండుట కిపుడు అవకాశము లేదనియు తెలియ జేయవలెను.

* * * *

## నియోజకవర్గమునకు శ్రీ ఏ. రంగస్వామి అయ్యంగారి సందేశము

"అభిప్రాయభేదమ్ము లున్నను రాజీనామా నొసగుచున్నాను"

ఇప్పటివిమట్టుకు తిరుగా ఎన్నికకు నిలువను

చెన్నపురి, జన 7:— శ్రీయుత ఏ. రంగస్వామి అయ్యంగారు (హిందూపత్రికా సంపాదకులు) తంజావూరు—తిరుచినాపల్లి జిల్లాలయందలి తమనియోజకవర్గమున కిదిగువ ముద్రింపబడిన సందేశము నొసంగుచున్నారు:— లాహోరులో దేశీయ మహాజనసభవారు గావించిన సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానము ననుసరించియు, తదనుగుణముగా శాసనసభలలో నున్న కాంగ్రెసు వాదులను తమ సభ్యత్వమునకు రాజీనామా నొసంగుడని కాంగ్రెసువారు గావించిన యాజ్ఞ ననుసరించియు, యీవిషయమున నాకు అభిప్రాయభేదమున్నను భారతజాతీయ మహాసభయందలి నా భక్తి విశ్వాసములచే నేను రాజీనామా నొసంగుట కాంగ్రెసుపక్షమున ఎన్నికకు నిలిచియుండిన నాకు విధ్యుక్తధర్మమై యున్నది. కావున నట్లొనరించుచున్నాడను.

స్వంతవ్యవహారములకు సంబంధించిన కొన్ని కారణముల వలన భారతశాసనసభ కెన్నుకోబడుటకై ప్రస్తుతము అభ్యర్థిగా నుండదలచుట లేదు" (ఆ. ప్రె)

## సత్యమూర్తిగారి ప్రకటన

కాంగ్రెసు తీర్మానము నుల్లంఘించవలెను

ఢిల్లీ, జన. 6:— ఎస్. సత్యమూర్తిగారు యిట్లు ప్రకటించుచున్నారు:— కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యమును తీర్మానించినందులకు ఎదురుతిరిగెడివారి చర్యలను నేను సమర్థింపజాలను. అట్లు చేయుట తప్పు. సంపూర్ణ స్వాతంత్ర్య ప్రతిఘటన యత్నములు తప్పక విఫలమగును. భారతస్వాతంత్ర్యోద్యమమునకు ఆత్మగౌరవముగల ఆదర్శము వేరొండుండనేరదు. అట్టిదానిని లేకుండ అధినివేశ స్వత్వమైనను సంగతిచో ఇండియా అంగీకరింపవచ్చునా లేదాయనునది వేరేవిషయము. ఐర్లాండు దక్షిణ ఆఫ్రికాలు సంపూర్ణస్వాతంత్ర్యము కొరకు పోట్లాడి అధినివేశస్వత్వమ్ము నంగీకరించినవి. ఇండియాకూడ సమయము వచ్చినప్పుడట్లే చేయును. మరియు, అధినివేశ స్వత్వముగూర్చి మోమోదింపదగినదై నిర్వచింపబడినచో, రాజ్యాంగతీర్పు విధమై, సభలో చేరవలెనన్న యుక్తివాదమువలన కాంగ్రెసు

వారు కొందరు టేబిలు సభలో పాల్గొనవచ్చునని యే నాయుద్దేశము, కాని లాహోరు కాంగ్రెసులో జరిగిన గొప్పతప్పు శాసనసభల బహిష్కారము నిర్ణయించుట. నాకుగల ఆక్షేపణలను యిదివరకే సూచించియుంటిని. అధ్యక్షుడు పటేలుగారు కాంగ్రెసు అభ్యర్థిగ నిలువనందున, వారు యిట్టి వాగ్దానములు చేసియుండలేదు గావున తమ అధ్యక్షపదవికి రాజీనామా నీయనని యే నమ్ముచున్నాను. కాంగ్రెసు పేరున ఎన్నుకొనబడిన శాసనసభ్యులకు చెప్పవలసిన పెద్దశాసనము,లన్నింటిని ఉల్లంఘింపవలెనని మహాత్మగాంధిగారు మనకు బోధించియున్నారు. న్యాయస్థానములనుండి శాసనసభలను మాత్రమే బహిష్కరించమని కోరుట పెద్దశాసనమువంటిదే, కావున దానినుల్లంఘింపవలెను. డిమాక్రాటిక్ పద్ధతిని నమ్మినటువంటి మేముగూడ ఎన్నిక సమయములందు గావించిన వాగ్దానములను తప్పినడువరాదు. ఎట్టిపరిస్థితులలోగూడ శాసనసభలను బహిష్కరింపరాదను మరకుపై తిరిగి ఎన్నికకు నిలువవలెను. కావున రాష్ట్రసభలకు అసెంబ్లీ, స్టేటుకౌన్సిలునకు ఎన్నుకొనబడిన కాంగ్రెసువారందరును వెంటనే సమావేశమయి, అన్యవిధాకరమగు బహిష్కారనిర్ణయమును వదిలి కాంగ్రెసు సంస్థను పవిత్రపరచి నిజమగు ప్రతిప్రాతినిధ్యముకలిగి పటుతరమగు రాజకీయ కార్యక్రమము ననుసరించునట్లు చేయవలెను. శాసనసభయందున్నవారందరు కాంగ్రెసు డిమాక్రాటిక పక్షమునందు చేరి కాంగ్రెసును రక్షించి దేశమునకు సేవచేయ గోరెదను.

### జమ్నాదాసు మెహతాగారి ప్రకటన

ఢిల్లీ, జన 7:— జమ్నాదాసు మెహతాగారు భారత శాసనసభ్యత్వమునకు రాజీనామా పంపుచు దానితోబాటు యీదిగువరీతి ప్రకటించిరి:— లాహోరు కాంగ్రెసులో సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానము గావింపబడుట జాతీయ గౌరవమున కెంతయు తగియున్నది. కాంగ్రెసునకు వేరొక గౌరవప్రదమగు మార్గము లేకుండెను. కాని శాసనసభా బహిష్కార తీర్మానము వలన దాని ఫలితము చెడినది. ఈ బహిష్కారము అనవసరము. స్వాతంత్ర్యోద్యమమునకు ప్రతిబంధకము. ఇతర దేశములలో స్వాతంత్ర్యోద్యమములతోబాటు శాసనసభాకార్యక్రమము గూడ కొనసాగుచున్నదని ఈజిప్టుచరిత్రబట్టి తెలియగలదు. అచట వాఫ్దుపక్షమువారు తమదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును కోరుచున్నను మొన్నటి ఎన్నికలలో అధిక సంఖ్యగావచ్చి శాసనసభను వశపరచుకొనిరి. ఐర్లాండులో డివాలెరాగారు రిపబ్లికు కొరకు పోరాడుచు మొదట డయులుసభను బహిష్కరించినను, ఒక ప్రసిద్ధభారతీయుని సలహాపై 1927 సం॥ ఎన్నికలందు పోటీచేసి అసెంబ్లీయందు సగము స్థానములను ఆక్రమించెను.

కాంగ్రెసు సభ్యులు అసెంబ్లీలో గాంచిన విజయము వారి కీర్తి నినుమడింప జేయును. రిజర్వుబ్యాంకు బిల్లు నిరాకరింపబడుట, ప్రజారక్షణచట్టము, నిరశన వ్రతచట్టములు ఉపసంహరించుకొనబడుట కాంగ్రెసువారి ప్రతిఘటన ఫలితములే. అధ్యక్షులగు పటేలుగారు ధైర్యసాహసములతో ప్రవర్తించి కాంగ్రెసుప్రతిభను పెంపొందించిరి. ఈ ముఖ్యవిషయములన్నింటిని కాంగ్రెసు మరుగుపరచి ఆరేండ్లనుండి త్యాగబుద్ధితో విశ్వాసముగ పనిచేయుచున్నవారి నవమానపరచుటయగును. శాసనసభాబహిష్కారమునకు ప్రతికూలముగ కాంగ్రెసుసభయందును విషయనిర్ణయసభయందును నేను స్పష్టముగ దెలిపియుంటిని. విదేశీయులగు పాలకులతో బలవత్తరముగ పోరాడుటకు కాంగ్రెసు కిరువారి శాసనసభలే ప్రధానమగు మండపములు. హాజిగారి కోస్తావాణిజ్యబిల్లు దేశమునకెంతో లాభకరమయినది. కాంగ్రెసువారు అసెంబ్లీలో నుండకుండినచో అది వీగిపోవుట నిశ్చయము. మరియు ముందువచ్చెడు పన్నుల అధికము జేయ నూహించగలదు. ప్రజలపై సాలీనా పదికోట్ల భారము పడును. ఇట్టి సమయమున శాసనసభలను శత్రువులకు విడచి, మన సైన్యమును ప్రధానరంగమునుండి మరల్చుట వినాశకరము. లాయరులు కోర్టులకు పోయి న్యాయపరిష్కారమునందు ప్రభుత్వమువారికి తోడ్పడ అవకాశమిచ్చుచు, స్వార్థత్యాగులగు దేశసేవకులు పెద్దశాసనము లమలు జరుగకుండ కాపాడుటకై ప్రభుత్వమువారితో పోరాడకుండ జేయుట చాల ఆశ్చర్యము. కాని జాతీయసభలు జరిగిన వారములో ఉద్రేకతరంగములు వచ్చి హేతువాదమునంతటిని ముంచివేసినవి. గాంధిగారి పలుకుబడివలన అంతయు జరిగిపోయెను.

శాసనసభా బహిష్కారముగూర్చి నా యభిప్రాయములట్లుండ, కాంగ్రెసు పేరున ఎన్నుకొనబడినవాడ నగుటచే, నా వాగ్దానానుసారము నేను రాజీనామా నీయకతప్పదు. ఈ ప్రకటనతోబాటు నేను రాజీనామాగూడ పంపుచున్నాను. నా రాజీనామాప్రతిని పండిత మోతీలాలు నెహ్రూగారు తమ కొకటి పంపగోరినట్లు పత్రికలలో గాంచితిని. శాసనసభా బహిష్కార తీర్మానము గావింపబడినపోడకే అసెంబ్లీలో కాంగ్రెసుపార్టీ యంతరింపవలసె. కావున అంతరించిన పక్షము [illegible] కావున అట్లు [illegible] నాకు సమంజసముగ కనుపడలేదు. శాసనసభా బహిష్కారము

గూర్చి మహాత్మునకు తప్పుడు సలహాచేసిన పండిత మోతీలాలు గారికి అసెంబ్లీ సభ్యత్వము యిచ్చుట పొరపాటు. అయినను నేను నా రాజీనామా ప్రతిని సంతోషపూర్వకముగ పంపించుచున్నాను. తిరిగి ఎన్నికకు నిలచుటనుగూర్చి నేనింకను నిశ్చయింపలేదు కాని నేను బొంబాయి వచ్చునంతవరకు ఓట్లను యింకొకరికి వాగ్దానము చేయరాదని నియోజకవర్గములను కోరుచున్నాను. (అ. ప్రె)

* * * *

## శాసనసభలను బహిష్కరించుట

### కాంగ్రెసుసభ్యులు రాజీనామా నొసగుటకు ముందుగా నొక్కచోట సమావేశము కావలెను

శ్రీయుత ఎస్. సత్యమూర్తిగారిట్లు ప్రకటించుచున్నారు:—స్టేటుకౌన్సిలు, అసెంబ్లీ, మద్రాసు శాసనసభల యందలి కాంగ్రెసుసభ్యులు వెంటనే సమావేశమై, తమకర్తవ్యమును సమష్టిగా నాలోచించి నిర్ణయింతురని నమ్ముచున్నాను. రాజీనామాల విషయమున కాంగ్రెసు తీర్మానమును అతిక్రమింపరాదు. కాని మనమందరము రాజీనామాల నొసగిన తక్షణమే భారతదేశమునకు స్వాతంత్ర్యము రాదు. మనము యికముందు నిర్వహింపవలసిన కార్యమెంతో కష్టముగా నుండును. ఈ విషయమున తొందరపాటు యెంతమాత్రము కూడదు. ఈ సమయమున మనము శాంతముతో అన్ని విషయములను బాగుగా నాలోచించి పనిచేయవలసియున్నది. ఇంకను రాజీనామాల నొసగనట్టి నా మిత్రులందరును తొందరపడకుండ మన కార్యక్రమమును సమిష్టిగా నాలోచించి నిర్ణయింతురుగాక! కాంగ్రెసు కౌన్సిల్ పార్టీ 19వ తేదీన సమావేశమయి యొక కార్యక్రమమును నిర్ణయించునను. ఈలోపున మద్రాసు శాసనసభ యందలి కాంగ్రెసు సభ్యులను రాబోవు శనివారమున అనగా 11వ తేదిన ఉదయం 8-30 గంటలకు తిరువల్లిక్కేణిలో నున్న నా స్వగృహమందు సమావేశమగుటకు ఆహ్వానించుచున్నాను. ఈ సమావేశమునకు కాంగ్రెసు సభ్యులందరును హాజరగుదురు గాకయని విన్నవించుచున్నాను.

### వంగరాష్ట్రము తొమ్మండుగురు

## సుభాసుబోసు, జమ్నాదాసు మెహతాయున్నగు వారు రాజీనామాల నంపుట

కలకత్తా, జనకి:—సుభాసుచంద్రబోసుగారు వంగరాష్ట్ర శాసనసభ్యత్వమునకు కలకత్తా కార్పొరేషను సభ్యత్వమునకు రాజీనామా నిచ్చిరని ఫ్రీప్రెసువారికి తెలియచేయబడెను.

వంగరాష్ట్రశాసనసభలో నిదివరకు రాజీనామా లిచ్చిన వారితోడుగ మరియేడ్గురు రాజీనామాలంపినట్లు నేడు తెలియవచ్చెను. కాంగ్రెసు కౌన్సిలుపార్టీ డిప్యూటీలీడరు డా॥ బిధనుచంద్రరాయి గారును, నళినరంజన సర్కారుగారు, సాధనచంద్రరాయ్, శాంతోషకుమారబాసు, శ్యామప్రసాదు ముఖర్జీ, మన్మథనాథరాయి, ప్రభుదయాళహిమతసింగుగార్లు తమ సభ్యత్వమునకు రాజీనామాల నంపిరి.

రామప్రసాద్ ముఖర్జీగారు స్టేటుకౌన్సిలు సభ్యత్వమునకు రాజీనామా నిచ్చిరి. (అ. ప్రె)

### జమ్నాదాసు మెహతాగారు

ఢిల్లి, జనవరి 6 —జమ్నాదాసు మెహతాగారు భారతశాసనసభ్యత్వమునకు రాజీనామా పంపుచు గవర్నరు జనరలుగారికి వ్రాసిన లేఖలో అందుకు గల కారణములను చెప్పుచు స్పష్టముగ వ్రాసిరి. (అ. ప్రె.)

• • •

## ఇంకను రాజీనామాలు

### పంజాబురాష్ట్రము

లాహూరు, జన 7:—కాంగ్రెసు మహాసభ వారి యాజ్ఞను పారముగా లాలా హంసరాజ్ ఎం. ఎల్. ఏ., అఫ్జల్ హక్ ఎం. ఎల్. సి. గార్లు తమ భారత శాసనసభ, రాష్ట్రీయశాసనసభా సభ్యత్వములకు రాజీనామానొసంగిరి. (అ. ప్రె.)

### లండను తపాల్

లండనునుండి తపాలును విదేశములకు గొనిపోవుచున్న పి యిండ్ ఓ స్టీమరు 'మాసిడోనియా' యీనెల 4 వ తేదీ 8 గంటలకు మార్సెయిల్సునుండి బయలెను. ఇంగ్లీషుఛానెల్ లో వాతావరణస్థితి విపరీతముగా నుండినందువలన లండనునుండి కొంచెమాలస్యముగ పంపబడిన టపా పైన సూచించిన సమయమునకే అందినది. (అ. ప్రె.)

## ఆంధ్రదేశపు స్వరాజ్య శాసనసభ్యులు

### మద్రాసు శాసనసభ

1 శ్రీ బిశ్వనాథదాస్ మహాశయాగారు
2 శ్రీ వరదా కామేశ్వరరావుగారు
3 శ్రీ పి. సి. వేంకటపతిరాజుగారు
4 శ్రీ పి. వి. నరసింహరాజుగారు
5 శ్రీ కందుల వీరరాఘవస్వామిగారు
6 శ్రీ బిక్కిన వెంకటరత్నముగారు
7 శ్రీ రామసోమయాజులుగారు
8 శ్రీ దండు నారాయణరాజుగారు
9 శ్రీ మోతే నారాయణరావుగారు
10 శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు
11 శ్రీ పి. ఆంజనేయులుగారు
12 శ్రీ సి. ఆర్. పార్థసారథి అయ్యంగారు (?)
13 శ్రీ కె. కోటిరెడ్డిగారు
14 శ్రీ ఎ. పరశురామరావుగారు
15 శ్రీ ఓబిరెడ్డిగారు
16 శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు
17 శ్రీ ఫి. శివరావుగారు

### భారతశాసనసభ

1 శ్రీ వరహగిరి జోగయ్యగారు
2 శ్రీ టంగుటూరు ప్రకాశంగారు
3 శ్రీ బత్తిన పెరుమాళ్ళనాయుడుగారు
4 శ్రీ సి. దొరస్వామయ్యంగారు

### స్టేటుకౌన్సిల్

1 శ్రీ వేమవరపు రామదాసుగారు

పైవారందరును ఆయాసభలకు కాంగ్రెసు మాత్రమున ననుసరించి, కాంగ్రెసు క్రీడను సంతకముచేసి ఎన్నుకొనబడిరి. కాంగ్రెసు నియమములకు బద్ధులమై యుందుమని వాగ్దాన మొసంగి యుండిరి. లాహోరులో కావింపబడిన తీర్మానానుసారముగ పై సభ్యులందరును తమ సభ్యత్వములకు రాజీనామా పెట్టవలసి యున్నది. వారి రాజీనామాలపై ఆంధ్రదేశపు ప్రజలు ఎదురు చూచుచున్నారు.

బె. గోపాలరెడ్డి,
బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు.

*

పైవారిలో, కాళేశ్వరరావుగారు, కోటిరెడ్డిగారు, మోతే నారాయణరావుగారు, వరహగిరి జోగయ్యగారు, టంగుటూరు ప్రకాశంగారు, సి. దొరస్వామి అయ్యంగారు, శ్రీ రామదాసు పంతులుగారు తమ శాసనసభ్యత్వములకు రాజీనామాలను పంపియుండిరి.

(ఆం. ప. సం.)

## చల్లపల్లి రాజాగారి పట్టాభిషేకము

శ్రీమంతు శ్రీరాజా యార్లగడ్డ శివరామ ప్రసాద్ బహద్దరు జమీందారుగారు, దేవరకోట పరగణా.

అభినందనము.

గీ॥ స్వస్తి మల్లికార్జునధరాపాలపౌత్ర!
స్వస్తి అంకినీడ్వాఖ్యపాల వరసుపుత్ర!
స్వస్తి! దేవరకోట రాజ్యనిధి వేంద్ర!
స్వస్తి! శ్రీశివరామప్రసాదభూప!

సీ॥ వినుతసంపత్ప్రదాయిని యైన లక్ష్మి నీ
నిలయమే నెలవుగా నిలిపియుండె
అమితవిద్యాధాత్రి యైనవాగ్దేవి నీ
జిహ్వాగ్రమందు వసించుచుండె
అఖిలశుభంబుల నలరించు జగదంబ
యిలువేల్పుగా మీకు నెసగుచుండె
ఆర్యజనస్తుత్య మగు సద్గుణశ్రేణి
నీయందు సొంపుగా నిలిచియుండె

గీ॥ ఎన్నిటం గన్న కొఱత లే దన్న! నీకు
నింక నెట్టియాశీర్వాద మిడెదువాఁడ
వెలుఁగెదవుగాక! చిరకాల జీవి వగుచు
రమ్యగుణదీప! శ్రీశివరామభూప!

సీ॥ ఆర్యాభినందితం బగునదుపదమున
సుమతిభూభృన్మణి సుకీర్తి మాయఁజేసి
నిత్యసత్యవ్రత నిష్ఠయందు ద్రికంబు
పట్టినిఖ్యాతిని పట్టుపఱచి
యర్థిలోకనిదాన మైన వదాన్యత
వంగరాజప్రశస్తి వమ్ముసేయించి
అఖిలధర్మస్ఫూర్తి కాధార మైన ధ
ర్మజాని యశంబెల్ల రహి నడంచి

గీ॥ నిఖిలవరపకుల్ నిమఁ దాచి కేర్చుకొనఁగ
జగతి నొప్పుమా! నీయందు సకలవిధవ
విజయమంగళసౌఖ్యముల్ వెలుఁగుఁగాక!
రమ్యగుణదీప! శ్రీశివరామభూప!

సీ॥ తాతగారిచరిత్రఁ బ్రీతిమై పఠియించి
యందలి సారంబు నరయుమయ్య
జనకుఁడౌ అంకినీడ్వనపాలచంద్రుని
కీర్తివల్లికలఁ బ్రాఁకింపుమయ్య
మాతుశ్రీయండట చంద్రమౌళీశ్వరమహీశు
వలయుపుణ్యంబు నరయుమయ్య
పినతండ్రి నాయుడమ్మను సుతిథుజములు గా
జేసికొని సుఖివై వెలుఁగుమయ్య

గీ॥ నిఖిలజనసముత్కంఠంబ వేఁడు నిచ్చ
రయముగాఁ గాఁ బడసిన రాజ్యరమను జనము
లెల్ల మెచ్చఁగాఁ జిరకాల మేలుమయ్య
రమ్యగుణదీప! శ్రీశివరామభూప!

సీ॥ పరమపావనమైన పండితాశీఃప్రభా
వంబు మోక్షంబుగా వఱలుఁగాక
అతిశయోక్తు లసమర్థమ్ములు లేనిమదీయ
వాణి సార్థకమయి వరలుఁగాక
సద్ధర్మనిరతవాసస్థలి శ్రీప్రజల్
దివ్యసౌఖ్యములఁ బొందెదరుగాక
సకలసంపదల కాస్థానమై మహితదే
వరకోటరాజ్యంబు ప్రబలుఁగాక

గీ॥ ధన్యగుణులైన పుత్రరత్నములఁ గాంచి
సీత వెంకటదుర్గమాదేవితోడఁ
వెలుఁగెదవుగాక చిరకాలజీవి వగుచు
రమ్యగుణదీప! శ్రీశివరామభూప!

శివరామప్రసాదభూపాలా!

మీ పూర్వులచే పాలింపఁబడిన ఈ దేవరకోట సామ్రాజ్యము సామాన్యమైనదికాదు. ఇప్పటి వసుంధరామణికే మల్లెపూలదండ సంపదల కలకాపురము పాఁడిపంటలకుఁ బాలవెల్లి. అట్టి యీసామ్రాజ్యరమాసభూటి సింగారించుకొని వచ్చి నేఁడు నిన్ను విభునిగాఁ బడసినది. నీ చిహ్నము, నీవిలాసములు గాంచి మోహించి కమనన్న చేయుచున్న సద్భోగలతాంగియై పతివ్రతయై సర్వసౌఖ్యముల వెలుఁగొనుము. శ్రీ జీవితము వహింపకపూర్వమే నీనిష్కృత్యము, ధర్మమును, కరుణను, శాంతమును బ్రకటించితివి. ఇఁక సామ్రాజ్యముఁ జక్కగ బరిపాలింపుము. మంచి పెద్దలఁ బరికింపుము. సత్కీర్తి దిశల నింపుము. ప్రజల బిడ్డలవలె భావింపుము. ఆశ్రితుల నాదరింపుము. రిపులను మాటలేక సుఖముగా జీవింపుము. దురాత్ములై సుట్టుఁజుట్టుఁ దుర్జనమండలమునకు గుండెదిగులై, ఆశ్రయించిన దీనకోటికిఁ గల్పవృక్షమై, ధర్మమార్గము పరిత్యజింపక మెలఁగఁ గోరు సుజనశ్రేణిచే తొలఁగిన చెన్నరై, నీపరిపాలనము చిరకాలము వర్ధిల్లుఁగాక, భగవత్పరిపాలనా వైభవము సత్కవిపుంగవుల నిర్మలవాణిచే గీర్తింపఁబడుఁగాక!

సీ॥ తిరుపతివేంకటేశ్వర సుధీంద్రులఁ గొల్చి
కవితాసభూటిని గాంచినాఁడ
మొగమైన జాపకే భూరివెంకటగిరి
ప్రభునిచే సత్కృతిఁ బడసినాఁడ
వేంకటకృష్ణరాడ్విభునొద్ద వాగ్దేవి
నాశించి పతకంబు నందినాఁడ
సీతంద్రి యగు వంకి శీకృష్ణభూపేత సం
పూర్ణసత్కారముల్ పొందినాఁడ

గీ॥ అప్పుడప్పుడు మీ రిచ్చు నప్పులముఁ
దినుచునున్నాఁడ దినినాఁడఁ దినెదునాఁడ
నాదరింపుము సీతరామాఖ్యునాదు
పున్నెముల ప్రోడ! శివరామపుడమిరేఁడ.

చల్లపల్లి, 26-12-29 } పండిత, ద్రోణంరాజు సీతారామరావు, కళాధిక గ్రంథకర్త.

# వృత్తాంతలేఖలు

## కైకలూరు తాలూకా

(స్వకీయవిలేఖరి)

### మంచినీళ్ల సప్లై

ఈ తాలూకాలోని వింజరం సెక్షను గ్రామములలోని మంచినీళ్ల చెరువులకు జనవరినెల 14 తేదీలగాయతు 20 తేది వఱకును, పెదలంక సెక్షను గ్రామములలోని మంచినీళ్ల చెరువులకు ఫిబ్రవరినెల 11 తేది లగాయతు 25 తేది వఱకును ఐంటుమిల్లి సెక్షను గ్రామములలోని మంచినీళ్ల చెరువులకు జనవరి నెల 21 తేదిలగాయతు 28 తేది వఱకును మంచి నీళ్లు సప్లైచేయబడుననియు, కైకలూరు సర్వాయపాలెం సిస్టమ్ కాల్వల చివర గ్రామములలోని చెరువులకు పైనైతే కాల్వలు మూసేముందు మఱియొకసారి సప్లైచేయబడుననియు కృష్ణాయీస్టర్న్ డివిజన్ ఎక్జిక్యూటీవు ఇంజనీరువారు తెలియపఱచుచున్నారు.

### ఇరిగేషను కాన్ఫరెన్సు

ప్రతిసాలువ మామూలుగా జరుపబడుచున్న ఇరిగేషను కాన్ఫరెన్సు కైకలూరు తాలూకా ఆఫీసులో 13-1-30 తేది పగలు 2 గంటలనుండి జరుపబడుననియు, కృష్ణా యీస్టరన్ డివిజను ఎక్జిక్యూటీవు ఇంజనీరువారు గత సంవత్సరములో గావింపబడిన పనులనుగూర్చియు ప్రస్తుతము పరిశోధనలోనున్న పనులనుగూర్చియు ముందు ప్రసంగించుచు సభను ప్రారంభించెదరనియు, సామాన్య స్వభావముగల విషయములను అర్జీలద్వారా విని చర్చించెదమనియు వ్యక్తిసంబంధమగు సప్లయిలోగాని, శాన్‌క్షన్ అయిన ప్లానులోగాని చేర్చుమని పెట్టుకొనబడు అర్జీలు విచారింపబడవనియు కృష్ణా యీస్టరన్ డివిజన్ ఎక్జిక్యూటీవు ఇంజనీరువారు తెలియపఱచుచున్నారు. కాని 13-1-30 తేది భోగిపండుగ ఆనాడు గవర్నమెంటు సెలవు దినము. రైతు లీపని రానేలేరు గనుక మఱియొక దినమునకు మార్చుట ఎక్కువ అవసరమని కృష్ణా యీస్టరన్ డివిజన్ ఎక్జిక్యూటీవు ఇంజనీరు వారిని కోరుచున్నాము.

### సారాదుకాణములు

1930-31 సం॥ యిజారాకు ఈ తాలూకాలోని సారా దుకాణములు ఫిబ్రవరి నెల 12 తేదీన గుడివాడ డిప్యూటీ కలెక్టరు వారి వలన కైకలూరు తాలూకా కచ్చేరిలో వేలంవేయబడునని తెలియుచున్నది. ఇజారాకు అమ్మబడే దుకాణములు 19.

### తాలూకాబోర్డు

ఈ నెల 3 వ తేదీని ఈ తాలూకాబోర్డు మీటింగు తాలూకాబోర్డు ఆఫీసులో జరిగెననియు అందు బడ్జెట్టువిషయమై చర్చింపబడి తీర్మానింపబడె ననియు తెలియుచున్నది.

---



---



## కడప

1930 జనవరి 8 వ తేదీ సాయంకాలము 5-30 నిమిషములకు కడప మార్కెట్టు స్క్వేరునందు ఒక గొప్ప బహిరంగ సభ జరిగెను. కాంగ్రెసు ప్రాపగాండా కమిటీ ఆఫీసునుండి చక్కగా మార్కెట్ స్క్వేరువరకు కవిరత్నముగారిచే వ్రాయబడిన గీతమును 14 మంది ప్రచారకులును స్కూళ్ల విద్యార్థులును, ఇతరులును వాద్యవిశేషములతో బాడుచు బజారులవెంబడి వెళ్లిరి. జనులు వేలకు వేల్లు దీసియుండిరి. యీ మాటకు దృశ్యము చాల మనోహరముగ నుండినది. శ్రీ ప్రభుత్వమువారు కుట్రకు దండనీయమని నిషేధోద్యమముపట్టున ఇంతమాత్రము శ్రద్ధవహించినందులకు ప్రజలు ఆనందపడుచుండిరి. ఆ గీతములోని భావతరంగములు ప్రజలకు నూతనచైతన్యము గలిగించినవి. త్రాగుబోతులలో గొప్ప సంచలనము గలిగించినవి. పోలీసువారి ఏర్పాట్లు గూడ చాల అనుకూలముగ నుండినవి.

మార్కెటు స్క్వేరు చేరునప్పటికి అప్పటి కడప మ్యునిసిపలు చయిర్మనుగారి ఏర్పాట్లు చాల సంతృప్తికరముగ నుండినవి. వేలకొలది జనులు మూగియుండిరి. ఎవరెవరిదర్జాకు దగినట్లు వారువారు ఆసనముల నలంకరించియుండిరి. విద్యార్థులును, ధనికులును, రైతులును, ఆలేఖార్లును, భూస్వాములును అందరును వచ్చియుండిరి. త్రాగుబోతులును వచ్చియుండిరి కాని పాపము వారల కెవరును బుద్ధిచెప్పువారే!

ఏ. కే. మునిగారి యధ్యక్షత క్రింద సభ బహు జయప్రదముగ జరిగెను. భజనానంతరము ప్రచారకులు అబ్దుల్ ఖాదర్ చెరుపుగారును, కవిరత్న కే. వి. ఎన్. రెడ్డిగారు, నాగనార్యులు గారు, కే. ఎల్. నరసింహారావుగారు, కాకర్ల పెద్దవీరయ్యగారు, అబ్దుల్ ఖాదర్ షరీఫుగారు మున్నగువారు ఇంపుగను, సొంపుగను, యుక్తియుక్తముగను, సభ్యుల మనంబులకు వచ్చునట్లు గంభీరోపన్యాసము గావించిరి. చాలమంది దుఃఖాశ్రువుల రాల్చుచుండిరి. ముఖ్యముగ కవిరత్నముగారును కే. ఎల్. నరసింహారావుగారును, నాగనార్యులు చెప్పినప్పుడు బ్రాందులు సైతము చిరుచ్చున ట్లుండెను. మంచి ప్రచారకులను ఎన్నుకొనినందులకు చెయిర్మను రంగారెడ్డిగారిని చాల ప్రశంసించుచుండిరి. ఇట్టివారిచే ప్రచారము కొంతకాలము జరిపించుచో దేశము మంచిస్థితికి వచ్చు నని సభ్యు లన్వయించుచుండిరి.

పిమ్మట, ఏ. కే. మునిగారు మద్యపానమువలని కీడులను గుఱించి సందర్భోచితముగా జేసిన ప్రసంగమునకు సభ్యులందరు చాల సంతసించిరి. నెలకొక పర్యాయము కడప పురమున నిట్లు జరుగునని అధ్యక్షులగు మునిగారు చెప్పినప్పుడు ప్రజల యానందమునకు మేరలేదు. త్రాగుబోతులు చాలమంది త్రాగమని ప్రమాణములు చేయుచున్నారు. అప్పుడే మూడు టెంపరెన్సు లీగులు కడపపురమున స్థాపింపబడినవి. ఉదయము 9-30 నిమిషములలోపల రాత్రి 8 గంటలపైన కల్లు సారాయి అంగళ్లు విషయమై కమిటీ చెయిర్మను గారికి సవిస్తారముగా కంప్లయింట్లు పంపుకొందుమని సంఘములవారు సెక్రెటరి గారికి తెలిపి యున్నారు. మా మండలమునందంతటను ప్రచారము చక్కగ జరుగుచున్నదని వ్రాయుట కెంతయు సంతసించుచున్నారము.

(ఒకవిలేఖరి)

---



---



---



## కడప

### కడప టెంపరెన్సు మీటింగులు

జనవరి 8:— కడప పట్టణమందు 8-వ తారీఖు సాయంకాలమందు మార్కెట్టు యెదురుగా నుండు మైదానమందు కడప టెంపరెన్సుకమిటివారు నిషేధ మీటింగులను జరిపిరి. బడిపిల్లలు కొందరు నిషేధసంబంధము లగు పాటలను పాడిరి. చాలమంది కూడి వినిరి. టెంపరెన్సు కమిటీవారిచే నియోగింపబడిన ప్రచారకులు చాలమంది, వుర్దు, తెలుగు, హిందూస్థానియందు మాటలాడిరి. మీటింగు 8 గంటలకు ముగిసెను.

నిన్నటిదినము 4 వ తేదిన పై మైదానమందే నిషేధసభ మండల కమిటి వైస్‌చెయిర్మను అంజనాబ్ మహబూబ్ సాహెబుగారి అధ్యక్షతను జరిగెను. ప్రజలు చాలమంది గూడిరి. వుర్దు, హిందూస్థాని ప్రచారకులు ఖురాన్‌లోని కొన్ని అంశములను పాడి త్రాగడు మతవిరుద్ధమను నిజమును వెల్లడిపరచిరి. కొందరు హిందూప్రచారకులు క్రైస్తవప్రచారకులు మాటలాడిరి. సభ రాత్రి 8 గంటలకు ముగిసెను.

ఈ కమిటీవారు యీ పట్టణమందే యితర భాగముల యందు యిట్టి నిషేధసభలు జరుపుదు రని తెలియుచున్నది.

### శారదాబిల్లు

ఈ మండలమందలి వైశ్యజనులందరును గూడి శారదాబిల్లును రద్దుపరచవలెనని వైస్రాయి గారికి ఒక విజ్ఞాపనము తయారుచేసియున్నారు. కడప, కర్నూలు, అనంతపురం, చిత్తూరు మండలములలో వైశ్యజనుల సంతకములు గైకొనుటకై యేర్పాట్లు జరుగుచున్నవి. కమలాపురం మాకం చిన్నవెంకటసుబ్బయ్యశెట్టి మొదలగువారలు వైశ్యజనులతరఫున ప్రతినిధులుగా నెన్నుకొనబడిరి.

ఈ కడపపట్టణమందే మార్చినెల ఆఖరులో శారదాబిల్లు అమలులోనికి రాగలదని యెంచి యీ డిసెంబరునెలలోని ముహూర్తములలో లెక్కలేని పెండ్లిండ్లు జరిగినవి. లోగుట్టు బయటపడక పోయినను చిన్న ఆడబిడ్డలను వివాహమొనరించుటకిదియే మూలకారణము. యిక కొన్నేండ్లదాక భయములేనట్లు యేర్పరుచుకొని యెటువున్న శారదాబిల్లు రద్దుకాదని తెలుసుకొన్నవారు గాన యిప్పుడు యీ విజ్ఞాపనమును తయారుచేయుచున్నారు. చాల లేతపిల్లలు మాత్రము పెండ్లికాక యిప్పుడున్నారు. బిల్లు అమలులోనికి వచ్చి ప్రాతబడి శాంతిగలిగినప్పటికి యీ పిల్లలు పెండ్లికి యెదుగగలరు.

### ఇల్లుకూలుట

ఈ దినము పగలు రెండుగంటలకు గడ్డిబజారువీధియందు బంగారుపనిచేసే వుస్మాన్‌సాబుగారిది క్రొత్తగా నిర్మింపబడుచుండే యిల్లు కూలిబడినది. ఒక మదపలికూలి యామెపై కప్పుపడడముతోటి వెంటనే మరణించెను. ఇంకొక ఆడకూలి తల్లో గాయములు తగిలినవి. వెంటనే ఆమె ఆసుపత్రికి గొంపోబడినది. గాని బ్రతుకుట దుర్లభము. యింటికప్పుమీద పనిచేయుచుండిన కూలీలు యిద్దరును కప్పువెంటనే క్రిందపడిరి. కొన్ని గాయములు తగిలినవి. కూలినయింటికి ప్రక్కనయుండు యిల్లుకూడ పచ్చిగానుండబట్టి గోడలు కొంచెము వాలియుండబట్టి పడియుండు కప్పును యెత్తుటకు భయముతో యెవ్వరును పూనుకొనాలకున్నారు. యింకను అందు యెందరున్నారో తెలకున్నది.

మునిసిపాలిటివారు ప్రక్కన వాలియుండుయింటినిగూడ కొట్టించుటకు యేర్పాట్లు చేయుచున్నట్లు తెలియుచున్నది.

అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులగు శ్రీయుత కే. కోటిరెడ్డిగారు, కే. సుబ్రహ్మణ్యంగారు నిన్నటిరాత్రి లాహోరునుండి తిరుగువచ్చిరి శ్రీయుత కే. కోటిరెడ్డిగారు శాసనసభ సభ్యత్వమునకు నేటిదినము రాజీనామాను గవర్నరుగారికి పంపినారు. కాంగ్రెసు తీర్మానములు తనకు సమంజసముగ లేదని కాంగ్రెసు సభ్యత్వమునకుకూడ రాజీనామా నిచ్చినారు. కాంగ్రెసేతరపక్షమున మరల శాసనసభ సభ్యత్వమునకు పోటీచేయుదురని తెలియుచున్నది.

(ఒకవిలేఖరి)

---

